## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ అష్టమి 1954 సం॥ అక్టోబరు 5 మంగళవారం సం॥ అష్టమి 23-31 పూషా రా 3-13 వర్జ్యం 11-46 ల 1-29 వ.

శు॥ నవమి అక్టోబరు 6 బుధవారం ఋ॥ నవమి 24-0 ఉ షా రా 4-11 వర్జ్యం 11-32 ల 13-12 వ.

ఆంధ్రపత్రిక

[illegible]

శ్రీ జయ సం॥ ఆశ్వయుజ శు॥ అష్టమి

మంగళవారం

## లండన్ సమావేశ నిర్ణయాలు

యూరప్ రక్షణ ఒడంబడికను ఫ్రాన్సు ఆమోదించని కారణంగా ఏర్పడిన విషమ పరిస్థితి తొలగిపోయినది. ఆరు రోజులుగా లండన్‌లో జరిగిన తొమ్మిది రాజ్యాల విదేశాంగ మంత్రుల సమావేశం పశ్చిమ జర్మనీ ఆయుధధారణ విషయంలో చరిత్రాత్మకమైన నిర్ణయం చేసింది. పశ్చిమయూరపు రక్షణలో జర్మనీ ప్రముఖపాత్రను వహించడానికి వీలుగా ఈ నిర్ణయం జరిగింది. అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలో పశ్చిమ జర్మనీకి సభ్యత్వం కల్పించే విషయంలోనూ త్వరలోనే నిర్ణయం జరుగనున్నది. పశ్చిమ జర్మనీకి ఈ రెంటినీ మించి అత్యంత ముఖ్యమైన నిర్ణయం మరొకటి వున్నది. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాలు పశ్చిమ జర్మనీపై ప్రస్తుతం చలాయిస్తున్న "ఆక్రమణాధికారాన్ని" వెంటనే రద్దుచేసి, శీఘ్రంగా పశ్చిమ జర్మనీకి సర్వస్వతంత్ర ప్రతిపత్తిని కల్పించడానికి ఈ మూడు రాజ్యాల విదేశాంగ మంత్రులు నిశ్చయించుకున్నారు. జర్మనీ ఏకీకరణకు పశ్చిమరాజ్యాలు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి. రష్యా సహాయ సహకారాల నిరాకరణలవల్ల పశ్చిమ రాజ్యాలు జర్మనీ పునరాయుధధారణ, స్వతంత్ర ప్రతిపత్తి విషయంలో త్వరితంగా నిర్ణయాలు చేయవలసిన అవసరం ఏర్పడింది.

పశ్చిమ రాజ్యాలు, సోవియట్ రష్యా జర్మనీ భవిష్యత్స్వరూపంపై సమాధానానికి రాలేకపోయినందువల్ల దాదాపు తొమ్మిది సంవత్సరాలు పశ్చిమ జర్మనీ 'పరాధీన' దేశంగా వుండిపోవలసివచ్చినది. యూరపు సమస్యల పరిష్కారానికిది తీవ్ర ప్రతిబంధకంగా వుంటూ వచ్చింది. జర్మనీ ప్రతిపత్తి, ఆయుధపరిమితి నిర్ధారణ అయితే గాని ఫ్రాన్సు-జర్మనీల మధ్య శత్రుత్వాలుగా వుంటున్న అవిశ్వాసం తొలగదు. ఫ్రాన్సు-జర్మనీలమధ్య విశ్వాసం కలిగి ఈ రెండు రాజ్యాలు పరస్పరం సహకరించుకుంటేగాని పశ్చిమ యూరప్‌రక్షణ సాధ్యంగాదు. బ్రిటన్, అమెరికా విదేశాంగ మంత్రులిచ్చిన హామీ ఫలితంగా ఫ్రాన్సు జర్మనీ పునరాయుధధారణకు సమ్మతింప వలిగింది.

యూరపు రక్షణ వ్యవస్థలో బ్రిటన్ వరిస్థైన బాధ్యతను వహింపనందువల్లనే ఫ్రాన్సు పార్లమెంటు యూరపు రక్షణ ఒడంబడికను ధృవీకరింప లేకపోయినది. అమెరికా, బ్రిటన్‌లు యూరపు రక్షణకు సైన్యాన్ని వుంచడానికి అంగీకరించడంవల్ల ఫ్రాన్సుకు వున్న సందేహాలు నివృత్తిఅయినవి. జర్మనీకి ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలో సభ్యత్వం లభించడంవల్ల యూరపురక్షణ వ్యవస్థ ఏర్పడని లోటు తీరిపో గలదు. పశ్చిమ జర్మనీ విషయంలో పశ్చిమ రాజ్యాలు చేసిన నిర్ణయం ఫలితంగా సోవియట్ రష్యాకూడా తూర్పు జర్మనీ విషయంలో నూతన విధానాన్ని అనుసరించవలసి వస్తుంది. తత్ఫలితంగా జర్మనీ ఏకీకరణ, ఐక్యజర్మనీ ప్రభుత్వ స్థాపన సులభసాధ్యం కావచ్చును.

## 'అమెరికా సహాయం ఎక్కువగా వుండాలి'

### న్యూయార్కు విలేఖరులతో మహమ్మదాలీ గోష్ఠి

న్యూయార్క్, అక్టోబరు 4: పాక్ ప్రధాని మహమ్మదలీ నేడిచటకు లండన్ నుంచి వచ్చాడు. రాగానే పత్రికా విలేఖరుల గోష్ఠి జరిగింది.

స్వాతంత్ర్యాను చివరిసారిగా తాము కలసి కొన్ని ప్పటినుంచి భారత దేశంతో, పాకిస్తాన్ సంబంధాలు దురదృష్టవశాత్తు అభివృద్ధి చెందలేదనీ, తాము చేసిన కృషి వ్యర్థమయిందనీ మహమ్మదాలీ విలేఖరుల ప్రశ్నలకు సమాధానంగా చెప్పారు.

"స్వతంత్రా" పీపైపు మొగ్గు చూపుతున్నాడో మీరు చెప్పగలరా? అన్న ప్రశ్నకు, దానికి సమాధానం "స్వతంత్రా" యే చెప్పాలి" అని మహమ్మదాలీ జవాబిచ్చారు

"అమెరికానుంచి అదనపు సైనిక సహాయం కోరుతారా?" అన్న ప్రశ్నకు మహమ్మదాలీ సమాధానమిస్తూ 'వివరాలు నాకు తెలియవు. కాని చాలినంత సహాయం లేకపోతే మటుకు ఆచరణలో అది ఏమీ ప్రయోజనకరం కాదని విశ్వసిస్తున్నాను" అని చెప్పాడు.

## హోమియోపతీ వైద్యుల తరగతులు

### గుంటూరుజిల్లా సభ నిరసన

తెనాలి, సెప్టెంబరు 29: హోమియో వైద్యుల రిజిస్ట్రేషన్‌లో అందరిని సమాన ప్రతిపత్తితో రిజిస్టరు చేయుట న్యాయమనీ, ఈ విషయంలో ఆంధ్ర రాష్ట్ర హోమియో వైద్యసంఘంవారి అభిప్రాయంతో ఏకీభవిస్తూ, ఆ ప్రకారం చేయవలసిందిగా రాష్ట్రప్రభుత్వాన్ని గుంటూరు జిల్లా హోమియో వైద్యులు అభ్యర్థించారు.

గుంటూరు జిల్లా హోమియో వైద్యుల సర్వసభ్య సమావేశం తెనాలిలో 26 వ తేదీన డాక్టరు ఖండ్రిక సాంబయ్యగారి ఇంటివద్ద డాక్టరు ఆర్. ఇ. రంగనాయకులు గారి అధ్యక్షతన జరిగింది.

రాష్ట్రప్రభుత్వ హోమియో వైద్య విచారణ సంఘంవారు రాష్ట్రంలోని అన్ని హోమియో సంఘాలను సాకల్యంగా విచారించి, వారి అభిప్రాయాలకు తమ నివేదికలో స్థానమొసంగాలని కోరుతూ తీర్మానించారు. రాబోవు సమావేశం బాపట్లలో అక్టోబరు 31 వ తేదీన జరుపుటకు నిర్ణయించారు.

## భూమి సంస్కరణల సంఘ సమావేశం

### ఈనెల 21 న కాకినాడలో

కర్నూలు, అక్టోబరు 4: భూమి సంస్కరణల సంఘ ప్రథమ సమావేశం ఈనెల 21 తేదీన జరుగుతుంది. ప్రజల పరిశీలనకు జారీ చేయవలసిన ప్రశ్నావళియున్ను, తనిఖీ జాబితాలున్ను ఆసమావేశంలో నిష్కర్షచేయబడతాయి. సంఘాధ్యక్షులు లక్కరాజు సుబ్బరావుగారు కాకినాడలో ఇప్పుడిప్పుడే జబ్బునుంచి కోలుకొంటూ ఉండడంవల్ల ఈ సమావేశం కాకినాడలోనే జరుగవచ్చు. సంఘకార్యదర్శి డా॥ శాయన్న గారు మొన్నటి దినం కాకినాడనుంచి రాజధానికి తిరిగి వచ్చారు. స్వ. వి.

## దొమ్మవ్యాధి నివారణ: ఉద్యమానికి ఉపక్రమణ

కర్నూలు, అక్టోబరు 4: రాష్ట్రంలో దొమ్మవ్యాధి నివారణ ఉద్యమానికి మొన్న 1 తేదీన రాజధానిలోని పశువుల ఆస్పత్రిలో ప్రారంభోత్సవం జరిగింది. జిల్లా పశుసంపదభివృద్ధిశాఖకు చెందిన సిబ్బంది వారంతా హాజరయ్యారు. ఈ ప్రసారిక వివరాలన్నింటిని గురించీ సవిస్తరంగా చర్చించారు. ప్రభుత్వ పశువులకూ, కొన్ని ఇతర పశువులకూ టీకాలువేయడంతో ఉద్యమానికి ఉపక్రమణ చేశారు.

## నాలుగు అగ్ర రాజ్యాలలో ఇండియా ఒకటి

### డి. యన్. ప్రిట్ అభిభాషణ

బొంబాయి, అక్టోబరు 3: "ఆసియాలోని రెండు గొప్పశక్తులలో భారతదేశం ఒకటి. ప్రపంచంలోని నాలుగు అగ్రరాజ్యాలలో ఇండియా ఒకటి" అని ప్రఖ్యాత బ్రిటిష్ న్యాయవాది డి. యన్. ప్రిట్ నేడు బొంబాయి శాంతి సంఘ అధ్వర్యాన జరిగిన ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ అన్నాడు. తన లోటి ఆసియా రాజ్యాల నన్నిటినీ సమీకరించి ఆగ్నేయాసియా వ్యవస్థను బహిష్కరించుట ద్వారా, అ 'వ్యవస్థ' ఆశయం పూర్తిగ వ్యర్థంచేసి ప్రపంచ శాంతికి భారతదేశం దోహదమివ్వవచ్చుని, యిది చాలా గొప్పవిషయం కాగలదనీ ప్రిట్ అన్నాడు.

ఈ వ్యవస్థ ప్రపంచ శాంతికి చాలా ప్రమాదకరం. అది నవహైనాకు వ్యతిరేకంగా వుద్దేశించబడింది. భారతదేశానికి నిర్దుష్టమైన చక్కని విదేశాంగ విధానమున్నది. ఈ విధానం ద్వారా యిప్పటికే శాంతిస్థాపనకుకృషి చేసింది. మనిలా సంధిలో చేరక పోవడం ద్వారా శాంతి స్థాపనకు భారతదేశం ఎంతో కృషి చేసినట్లయింది.

ఏ దేశంలోనైనా నిజమైన విముక్తి వుద్యమం బయలుదేరితే, దానిని కమ్యూనిస్టు వుద్యమంగా చిత్రించడం అమెరికాకు పరిపాటి అయింది.

ప్రపంచ శాంతికి ఆయుధ విసర్జన చాలా అవసరం. పశ్చిమ జర్మనీ సైనిక పునరుద్ధరణ జరిగితే, జర్మన్ సమైక్యత ఆశలు భగ్నమైనట్లే. అంతేగాదు, మరో యుద్ధానికికూడ దారితీయవచ్చు.

త్వరలో జరుగనున్న ఆఫ్రికా, ఆసియా రాజ్యాల మహాసభ శాంతిస్థాపనకు కృషి చేయగలదు. ఎందుకనగా పాశ్చాత్య రాజ్యాల బలసలన్నీ యీ దేశాలలో వున్నాయి." అని ప్రిట్ వుద్ఘాటించాడు. పిదప బొంబాయి పత్రికాసంపాదకుల కార్యాలయ ఆవరణలో ఒక గోష్ఠిలో ప్రసంగిస్తూ, పోర్చుగీసు విమోచనలో నైనాకు పూర్తిగ సమర్థించవలసి వున్నదన్నాడు. అమెరికా పత్తిడి నుండి లేకపోయి నట్లయితే బ్రిటన్ ఏనాడో హాంగ్‌కాంగ్‌ను నైనాకు దత్తచేసి వుండేదన్న భావం కూడ బ్రిటిష్ ప్రజానీకంలో వున్నదని ప్రిట్ చెప్పాడు.

గోవా సమస్య ప్రస్తావిస్తూ ఇది కేవలం భారతదేశపు అంతరంగిక సమస్య అనీ, గోవా భారతదేశపు అంతర్భాగమనీ 'నాటో' సంస్థ గనుక యిందులో జోక్యం కల్పించుకుంటే బ్రిటిష్ ప్రజలు సహిస్తారని తమకు తోచడం లేదని వివరించారు.

భారతదేశంలో శాంతి కాముకత్వం బాగా నాటుకొన్నందుకు, ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడినందుకు హర్షం ప్రకటిస్తూ యిలా సాకపోయినట్లయితే చక్కని విదేశాంగ విధానాన్ని నెహ్రూ ఎన్నడూ నిర్ణయించి వుండేవాడు కాదని తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

కలకత్తాలో జరుగనున్న ఆసియా ప్రజాస్వామ్య న్యాయవాదుల సమావేశం శాంతి స్థాపన చర్యలలో వకటని చెప్పారు.

ఆసియా అంతటా హిరోషిమా దినోత్సవం జరపాలని ప్రిట్ సూచించాడు.

## కర్నాటక రాష్ట్రం

### షోలాపూరు కన్నడుల వాంఛ

షోలాపూరు, అక్టోబర్ 3: స్థానిక కన్నడులు గతరాత్రి పట్టణ పురపాలక సంఘ అధ్యక్షులు శ్రీ యస్. యస్. బసవంతిగారి అధ్యక్షతన ఒక కార్యాచరణ సంఘం ఏర్పరిచారు. జిల్లాలోని కన్నడ ప్రాంతాలను కర్నాటక రాష్ట్రంలో చేర్చుటకు ఆందోళన చేయుటే యీ సంఘం ఆశయం.

సమావేశానికి పార్లమెంటుసభ్యుడు (హైదరాబాదు) శ్రీ శివమూర్తి అధ్యక్షత వహించారు. కర్నాటకరాష్ట్రంలో షోలాపూరు పట్టణంతో పాటు అక్కలకోట తాలూకా, ఉత్తరదక్షిణ షోలాపూరు తాలూకాలు చేర్చాలని కోరుతూ తీర్మానించారు. హైదరాబాదును విచ్ఛిన్నం చేసి భాషారాష్ట్రాలలో కలిపివేయాలనికూడా అభ్యర్థించారు.

## సూరత్‌వద్ద వరదలు

### తపతీ తూర్పుగట్టున గోడకు దెబ్బ

సూరత్, అక్టోబరు 1: మున్ఫురా వద్ద తపతీనది తూర్పుగట్టున వున్న డచ్చితోటకు రక్షణగా అనుకునివున్న గోడ నెర్రె విచ్చింది. ఈగోడ 160 అడుగుల పొడవు 50 అడుగుల ఎత్తు వున్నది. సూరత్ పట్టణంలో వరదనీరు ప్రవేశించకుండా యీగోడ ఎంతో తోడ్పడింది. తపతిలో నీటిమట్టం 96 అడుగులకు పెరిగింది.

క్రొత్తగాగోడ నిర్మించాలంటే 4 లక్షలు ఖర్చవుతుంది. ఈ విషయం చూపెటానికి ఒక ఇంజనీరును పంపమని మున్సిపాలిటీవారు బొంబాయి ముఖ్యమంత్రికి తంతి నిచ్చారు.

బ్రోచ్ సమీప ప్రాంతాల్లో 5 వేల ఎకరాల పంట సెప్టెంబరు వరదమూలంగా నష్టమయినది. చాలా ఇళ్లు కూలిపోయాయి.

పంజాబ్‌లోని అంబాలా జిల్లాలో రెండుగ్రామాలు సట్లేజ్ లో కొట్టుకుపోయాయి.

# ఆయుధాల తగ్గింపు: అణుశక్తి వినియోగం

## సమితి సమావేశ జయాపజయాలు ఆధారపడివున్న రెండు ప్రధాన సమస్యలు

యునైటెడ్ నేషన్స్, అక్టోబరు 3: ఆయుధాల తగ్గింపు, అణుశక్తి ఉపయోగం, ఈరెండు సమస్యలను గూర్చి ఇప్పుడు సమితి సమావేశం ప్రారంభమై మూడోవారంలో పడిన ఈసందర్భంలో అన్ని రాజ్యాల ప్రతినిధులు ఆలోచిస్తున్నారు. ఈసమావేశం జయప్రదం అవడం, కాకపోవడం ఈరెండు సమస్యల విషయంలో ఏమన్నా అభివృద్ధి కల్పించడం, కల్పించక పోవడాలను బట్టే వుంటుందని అంతా గ్రహించి పనిచేస్తున్నారు.

రష్యా వైఖరి నిజంగా మారిందా? లేక ఇప్పటికి ఇట్లుమాట్లాడి అనంతరం కొత్త పేచీలు తెచ్చిపెట్టి ఈప్రతిష్టంభనను ఇట్లాగె సాగనిస్తుందా? అనే అంతా తెగమథన పడుతున్నారు. సోమవారంనాడు బ్రిటిష్ ప్రతినిధి సెల్విన్‌లాయిడ్ మాట్లాడతాడు. ఆయన ఏమి మాట్లాడతాడో చూద్దామని మరికొందరు వేచుక్కూర్చుంటున్నారు.

అసలు ఈయన శుక్రవారంనాడు మాట్లాడవలసి వుంది కాని వైషిన్‌స్కీ ప్రతిపాదనలను చూసిన అనంతరం ఆయన వాయిదా కోరారు. ఈవారం చివర పశ్చిమ రాజ్యాలు ఈ వ్యవహారాన్నంతా గూర్చి చర్చించుకొని లంటాయిగాబట్టి సోమవారంనాడు ఈయన మాట్లాడేదాంట్లో ఈ పశ్చిమ రాజ్యాల ఇంగితం ఎట్లావుందో విదోతమగునం అవుతుందని అభిజ్ఞులు ఆశిపడుతున్నారు. అదీకాక తులోపల లండన్ సభ వ్యవహారాలన్నీ తేలిపోతాయి గాబట్టి, ఈ పశ్చిమరాజ్యాలు తమ ఎత్తులు ఏమిటో గూడా కొంచెంగా లాయిడ్ ద్వారా వ్యక్తం చేయవచ్చుననిగూడా అనుకుంటున్నారు.

ఈయన తర్వాత ఫ్రాన్సు, చెకోస్లోవేకియా, యుక్రెయిన్, ఆదిగాగల 16 దేశాల ప్రతినిధులు మాట్లాడేవాళ్లు వున్నారు. ఇండియన్ ప్రతినిధి శ్రీ కృష్ణమీనన్ అందరికన్నా చివరివరసలో వున్నాడు. ఇదీ ఒక రకంగా బాగానే వున్నదని ఇచ్చట అంతా అనుకుంటున్నారు. ఎందుచేతనంటే ఆయన మాట్లాడ్డం అంటూ వచ్చేసరికి అటు పశ్చిమరాజ్యాలవారు, ఇటు రష్యా రాజ్యాలవారు మాట్లాడ్డం అయిపోతుంది. అందువల్ల వీటిని సింహావలోకనం చేసి, ఎంతవరకు సరియోధ్యతకు ఇందులో స్థానం వుందో తేల్చి సమితికి తెలియజేసే సావకాశం ఏర్పడుతుంది.

## క్షయ నిర్మూలనంలో ప్రజాసహకారం

### అమృతకౌర్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, అక్టోబరు 2: క్షయ నివారణ సంస్థలతో పూర్తిగ సహకరించి క్షయ నివారణ పత్రాల వుద్యమాన్ని జయప్రదం చేయవలసిందిగా ప్రజలకు కేంద్ర ఆరోగ్యమంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ రేడియో ప్రసంగంద్వారా ఒక విజ్ఞప్తిచేశారు.

ఐదవ క్షయనివారణ పత్రాల వుద్యమాన్ని ప్రారంభిస్తూ ఈ సందర్భంలో శ్రీమతి అమృతకౌర్ వేలాది క్షయ రోగులను కాపాడటానికి పూనుకోవడం ద్వారా మహాత్మునిపట్ల మనభక్తిశ్రద్ధలు వెల్లడించాలని కోరారు.

భారత ప్రభుత్వము, క్షయనివారణ సంస్థ తమకున్న సాధన సంపత్తితో ఈ వ్యాధినిగూర్చి, దీని నివారణ మార్గాల గూర్చి ప్రజలకు తెలియజేస్తున్నారు. క్షయనివారణకు బి. సి. జి. టీకాలు వేయడం, ఈ వ్యాధి నివారణకు సిబ్బందికి తగు శిక్షణయిచ్చే కేంద్రాలు స్థాపించడం ముఖ్య కార్యకలాపాలు.

ఆస్పత్రులు, చికిత్సా కేంద్రాలు నెలకొల్పడం శాస్త్రీయ పద్ధతులపై జరగడానికి చాలా డబ్బు ఖర్చుఅవుతుంది. యెక్కువ కాలం పడుతుంది. కనుక ప్రభుత్వం తినవలసే ఈ వ్యాధి నిర్మూలనకు కంకణం కట్టుకొని పనిచేసినా ప్రజలుకూడ ఒక పెద్ద వుద్యమాన్ని లేవదీయాలి.

యీ ఉద్యమమే క్షయ నివారణ సంస్థల స్థాపన క్షయనివారణ బిళ్లల (ముద్రలు) కొని పార్సెళ్లకు, వుత్తరాలకు అంటించాలి. ఈవిధంగా పందేశం బహు దూరప్రాంతాలకు సైతం వ్యాపించగలదు. మన 36 కోట్ల ప్రజలలో ప్రతివకరు వచ్చే నాలుగు నెలలలో ఒక ముద్ర చొప్పున వాడితే, దాని అర్థం అందరకు తెలిసినట్లు భావించాలి.

గత ఏడేండ్లలో 14 వేలమంది క్షయ రోగులకు మంచాలు అదనంగా ఏర్పరచబడినవి. దీనితో మొత్తం 20 వేలయింది. అయినా ప్రతి 180 మంది రోగులకు ఒకరికి మాత్రమే చికిత్స జరిగింది.

ఈ ముద్రల అమ్మకపు వుద్యమాన్ని ఒక డేనిష్ పోస్టు బంట్రోతు 50 సంవత్సరాల క్రితం కనిపెట్టాడు. వచ్చే డిసెంబరుకు 50-వ వార్షికోత్సవము జరుగగలదు.

అజ్ఞానం, దారిద్ర్యం, మురికిఇళ్లలో కాపురం, చికిత్సా సౌకర్యాలు సరిగా లేకపోవడం మనకు శత్రువులు. వీటితో పోరాడాలి.

కనుక అందరూ ముఖ్యంగా మహిళా సంస్థలు, విద్యార్థులు, క్రీడాసంస్థలు ఈ వుద్యమంతో పూర్తిగ సహకరించి జయప్రదం చేయాలని కోరుతున్నాను అని శ్రీమతి అమృతకౌర్ విజ్ఞప్తి చేశారు.

## సింహళ ప్రభుత్వ దురాలోచనలు

### గిరిగారి హెచ్చరిక

మదరాసు, అక్టోబరు 4: సింహళంలో కొన్ని దశాబ్దాలుగా నివసిస్తూ ఉన్న భారతీయులను ఆదేశం నుండి నిర్బంధముగా పంపివేయడాన్ని భారత ప్రభుత్వం తప్పక ఎదిరించాలని యీ విషయమై ప్రభుత్వము యిన్నాళ్లు అనుసరించిన వైఖరినే యింకా అనుసరించాలనీ సింహళంలో వెనుక భారత హైకమిషనరుగా నుండిన శ్రీ వి. వి. గిరిగారు యిక్కడ పత్రికలవారితో మాట్లాడుతూ చెప్పారు.

ఇండో సింహళం సమస్యలను పరిష్కరించటానికి ఉభయదేశాల ప్రతినిధుల రౌండుటేబిల్ సమావేశమొకటి జరుపవచ్చుని లేదా యీ సమస్యను సంయుక్తదేశాల కౌన్సిలు ముందర పెట్టి వారితీర్పును ఆశించవచ్చునని ఆతీర్పు లభించేదాకా సింహళమునగల భారతీయుల ఉద్యోగాలు నివాసము మొదలైన సమస్యలకు సంబంధించిన స్థితిగతులు యథాప్రకారం యిప్పటివలెనే సాగుతూ ఉండాలనీ వారు అభిప్రాయం వెల్లడించారు.

## వేసవి రాజధానిగా బెంగుళూరు

బెంగుళూరు, అక్టోబరు 3: సమశీతోష్ణంగల బెంగుళూరును వేసవి రాజధానిగా చేయడానికి బీహారు గవర్నరు శ్రీ ఆర్. ఆర్. దివాకర్ తమ సుముఖత తెలిపారు.

కార్పొరేషన్ సమ్మానానికి సమాధానమిస్తూ తానిసంగతే అందరికీ చెపుతున్నానని, ఏటా దక్షిణభారతదేశం సందర్శిస్తానని రాష్ట్రపతి మాట యిచ్చారనీ వెల్లడించారు.

## అణుశక్తి సత్వర అభివృద్ధి

### మేఘనాద్‌సాహా సూచన

కలకత్తా, అక్టోబరు 2: ప్రపంచంలో శక్తికి కొటకం ఏర్పడిందని ప్రముఖ భారతీయ శాస్త్రవేత్త మేఘనాధ్ సాహా యీ వారంలో న్యూఢిల్లీలో శక్తికి సంబంధించిన సమస్యపై మంత్రులు, రాజ్యాంగవేత్తల గోష్ఠిలో తెలియజేశాడు. ప్రపంచంలో బొగ్గు పరిమితమైయుండుటమే దీనికి కారణమని వివరిస్తూ దీనికి పరిష్కారం, సత్వరం అణుశక్తిని అభివృద్ధి చెయ్యడమేనని సూచించారు.

విద్యుత్ శక్తి వుత్పత్తి 100-కి 90 వంతులు బొగ్గుమీద, 10 వంతులు నీటిమీద ఆధారపడి వుందని తెలిపారు. ఏ ఏ దేశాల్లో ఈ కొరత ఎలా ఏర్పడిందీ లెక్కల వివరాలుకూడ ఆయన చెప్పారు.

వచ్చే కొద్ది దశాబ్దాలలో చైనా పారిశ్రామిక వంతంగా వెలుగొందగలదనీ, భారతదేశంలో మాత్రం వచ్చే 20 సంవత్సరాలలో పారిశ్రామికాభివృద్ధి 10 రెట్లు పెంచితే, బొగ్గునిల్వలన్నీ 50 ఏళ్లలో హరించిపోగలవనీ శ్రీ మేఘనాధ్ సాహా వివరించారు.

## జోహాన్సుబర్గ్‌లోని శ్వేతేతరుల సమస్య

### మలాన్‌ప్రభుత్వం పోటీగా కార్పొరేషన్ పెట్టే సూచన

జోహాన్సుబర్గ్, అక్టోబరు 2: జోహాన్సుబర్గునుంచి 58 వేల మంది యూరోపియనులు కానివారిని గెంటివేసేందుకు జోహాన్సుబర్గు కౌన్సిల్ అంగీకరించడంలేదు గనుక, ఆపని పూర్తిచేయడానికి మలాన్‌ప్రభుత్వమే దీనికి పోటీగా వేరేఒక స్థానిక అధికారవర్గాన్ని ఏర్పాటు చేస్తుందని తెలియవస్తున్నది.

ఇటువంటి పోటీ అధికారవర్గాలను ఏర్పాటు చేసేందుకు వీలుగా ఈమధ్య నే ఈయన ప్రభుత్వం పార్లమెంటు చేత కొన్ని శాసనాలు చేయించింది.

జోహాన్సుబర్గునుంచి ఈయూరోపియనులు కానివారిని గెంటివేస్తే, వ్యవహారం అన్నీ పర్వతంలాగా పరిణమించి పోతుందని స్థానిక నాయకులు హెచ్చరిస్తున్నారు.

## హానోయ్‌కి వియత్మిన్ ఉద్యోగుల రాక

### రాజధాని అయ్యే అవకాశం

హానోయ్, అక్టోబరు 3: వియత్‌మిన్ పరిపాలకోద్యోగులు 278 మంది ఇవాళ హానోయ్ చేరారు. ఇక్కడికి వచ్చిన ఉద్యోగుల మొదటి బృందం ఇదే. అక్టోబరు 11-వ తేదీన "హానోయి"ని జెనీవా ఒప్పందం ప్రకారం, ఫ్రెంచిప్రభుత్వం వియత్‌మిన్ ప్రభుత్వానికి ఒప్పగించి వేస్తుంది ఒప్పగింతకు ముందుగా, హానోయ్‌లోని ప్రభుత్వ ఆస్తిపాస్తులు అన్ని సక్రమంగా ఉన్నదీ లేనిదీ రేపు ఈ వియట్‌మిన్ ఉద్యోగి బృందంవారు తనిఖీ చేస్తారని వియత్‌మిన్ సన్నిహిత వర్గాలవారు చెప్పారు. ఈ తనిఖీ జరిగినప్పుడు, అంతర్జాతీయ పర్యవేక్షక సంఘ ప్రతినిధులూ, ఫ్రెంచి సైనిక ప్రతినిధులూ కూడా ఉంటారు.

ఏ ప్రాంతంలో నూ ప్రభుత్వ ఆస్తిపాస్తులను ధ్వంసం చేసే పనులు, ఏ పనులు తలపెట్టరాదనేది, జనీవా ఒప్పందంలో నిషేధముఖ్యాంశం.

పోతే, ఇప్పటి కార్యక్రమం ప్రకారం వియత్మిన్ పోలీసు దళాలు. 5-వ తేదీన, సైనిక పోలీసులు 8-వ తేదీన హానోయ్‌ని చేరుకుంటారు. వీళ్లు ముందుగా వచ్చినా, పరిపాలన మాత్రం అక్టోబరు 11 దాకా ప్రారంభించరు.

దక్షిణ వియత్నాం ప్రభుత్వం హానోయ్‌ని ఖాళీ చేసి వెళ్లిపోయింది. ఇపుడు ఫ్రెంచి సైనిక దళం ఒకటే హానోయిని పాలిస్తూంది.

తాయ్‌గుయెన నుండి, వియత్మిన్ ప్రభుత్వం రాజధానిని హానోయ్‌కి తరలించవచ్చునని వియత్మిన్ సన్నిహిత వర్గాలవారు అంటున్నారు.

పోతే, రష్యా, చైనాల రాయబారులు త్వరలోనే హానోయిలో కార్యాలయాలు తెరుస్తారనీ, ఇదివరకటినుండి ఇక్కడ ఉన్న ఇండియా, అమెరికా, బ్రిటిష్ ప్రతినిధి కార్యాలయాలు ఇటుపై కూడా ఉంటాయనీ ఒక్క జాతీయ చైనా ప్రతినిధికార్యాలయమే మూసి వేయబడిన దని వీరు చెప్పారు.

ఇండియా, అమెరికా, బ్రిటన్‌లకు వియత్మిన్‌తో అంతర్జాతీయ సంబంధాలు లేవు.

## దక్షిణ వియత్నాం అంతః కలహాలు

### బావ్‌దాయ్ విజ్ఞప్తి

సైగాన్, అక్టోబర్ 1: దక్షిణ వియత్నాం సర్వసేనాని జనరల్ హిన్ ప్రధాని న్గోదిన్ దియాంతో రాజీపడి, ఆయన మంత్రివర్గంలో చేరాలని వియత్నాం ప్రభుత్వాధిపతి బావ్‌దాయ్ నేడొక విజ్ఞప్తిచేశారు. మాజీ రక్షణ మంత్రి జనరల్ న్గొయెన్‌వాన్ జువానికీ, దియాంమంత్రి వర్గానికి ప్రతికూలంగాఉన్న మరొక సేనాని జనరల్ లెవెన్ వియాన్‌కీ కూడా ఆయన ఇటువంటి విజ్ఞప్తినే చేశారు.

బావ్‌దాయ్ విజ్ఞప్తుల ఫలితంగా, తాను ప్రధానికీ, సర్వసేనానికీ మధ్యవర్తిగా వ్యవహరించటానికి సిద్ధంగా ఉన్నట్లు మాజీ ప్రధాని న్గొయెన్ జువాన్ నేడు వెల్లడించారు.

జనరల్ విన్ కుయాన్ అనే మత వర్గ సంస్థకు నాయకుడు. ఈ సంస్థకు ఒక సొంతసైన్యం ఉన్నది.

## ఇజ్రేల్‌పై ఈజిప్ట్ దురాక్రమణ చర్యలు

### యుద్ధవిరమణ సంఘ విమర్శ

టెల్ అవీవ్, అక్టోబరు 2. ఇజ్రేల్‌పై ఈజిప్టు పదేపదే దురాక్రమణ చర్యలు సాగిస్తున్నదని ఇజ్రేల్ ఈజిప్టుల యుద్ధవిరమణ సంఘం నేడు విమర్శించింది. ఈజిప్టు ఇట్టి చర్యలు వెంటనే మానుకోవాలని ఈ సంఘం కోరింది.

ఈజిప్టు అధీనంలో ఉన్న 'గాజా'కు ఎదురుగా ఉన్న బాటపై పోతున్న నలుగురు ఇస్రాయేలు కర్షకులపై ఐదుగురు వ్యక్తులు సాయుధులై దౌర్జన్యం చేశారు. కర్షకులు ఇద్దరు మరణించారు. ఇద్దరు గాయపడ్డారు.

ఈ సంఘటనపై మిశ్రమ యుద్ధ విరమణ సంఘం ఇవాళ విచారణ జరిపింది. ఈజిప్టు చర్యలను ఖండిస్తూ ఇస్రాయెల్ ప్రతిపాదించిన చిత్తు తీర్మానాన్ని ఈ సంఘం ఆమోదించింది. అధ్యక్షుడు కల్నల్ కొరల్ శాధాలీ (డెన్మార్కు) ఇస్రాయెల్‌కి అనుకూలంగా ఓటు చేయడంతో తీర్మానం నెగ్గింది.

## ఖాజీపేట ఎక్స్‌ప్రెస్ ప్రమాదం

### కాకినాడ పురపాలక సంఘ సానుభూతి

కాకినాడ, అక్టోబరు 2: స్థానిక పురపాలక సంఘంవారు మొన్నటిదినం సమావేశమై గతనెల 27-వ తేదీన ఖాజీపేట రైలుప్రమాదంలో దుర్మరణానికి గురియైన ప్రయాణీకుల కుటుంబాలకు తమ సానుభూతి తెలుపుతూ తీర్మానించారు. దేశభక్తుడు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారి మృతికి సంతాపం వారి కుటుంబానికి సానుభూతి తెలుపుతూ మరో తీర్మానంచేశారు. మృతులయిన వారిపట్ల గౌరవసూచకంగా 2 నిముషములపాటు మౌనంగా నిలబడి సమావేశాన్ని 4-వ తేదీకి వాయిదా వేశారు.

# విద్యాధికులలో నిరుద్యోగ నివారణకు ప్రభుత్వ కృషి

## గ్రామ పాఠశాలలకు ఉపాధ్యాయులుగా సాంఘిక విద్యాప్రచారకులుగా నియామకం

న్యూఢిల్లీ, అక్టోబరు 3: విద్యావంతులలో, నిరాశ్రయపరత్వమును తొలగించడానికి 1953 ఆగస్టులో కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన పథకాన్ని అనుసరించి 28,880 గ్రామ పాఠశాలోపాధ్యాయులను, 1808 సాంఘికవిద్యాప్రచారకులను నియమించడమైనదని మొదటి పంచవర్ష ప్రణాళిక 1953-54 నివేదిక తెలుపుతున్నది.

పంచవర్ష ప్రణాళిక కాలంలో గ్రామ పాఠశాలలలో 80 వేల మందిని ఉపాధ్యాయులుగా నియమించడమూ, ఇంకా 8 వేల మందిని పట్టణ సాంఘిక విద్యా కేంద్రాలలో నియమించడమూ ఈ స్కీము ఆశయమై వున్నది.

1951-54 సంవత్సరాలమధ్య విద్యాభివృద్ధికి గాను 68 కోట్ల 50 లక్షల రూపాయలు ఖర్చయినవి. దీనిలో కేంద్ర ప్రభుత్వ ఖర్చు 8 కోట్ల 70 లక్షల రూపాయలు. కేంద్రం సాంకేతిక విద్య, వృత్తివిద్య అభివృద్ధికి గాను 6 కోట్ల 40 లక్షల రూపాయలు పూర్వ విశ్వవిద్యాలయ విద్యకు 2 కోట్ల 28 లక్షలు, విశ్వవిద్యాలయవిద్యకు 2 లక్షల రూపాయలు ఖర్చు చేసింది.

ప్రాథమిక విద్యావ్యాప్తికి రాష్ట్రీయ ప్రభుత్వంవారు 38,059 ప్రాథమిక పాఠశాలలను (బేసిక్ పాఠశాలలకంటె అన్యమైన వాటివి) అదనంగా ప్రారంభించడానికి పథకాలు వేశారు. యీ లక్ష్యంతో వారు పనిచేస్తున్నారు.

1953 సంవత్సరాంతం వరకు వారు 16276 కొత్త ప్రాథమిక పాఠశాలలను నెలకొల్పారు. వీటిలో 9 లక్షలమంది పిల్లలు చదువుకుంటున్నారు. 40 లక్షలమంది పిల్లలు చదువుకునే పాఠశాలలు నెలకొల్పడం వారి లక్ష్యము. ఇంక బేసిక్ పాఠశాలల విషయమున పంచవర్ష లక్ష్యం 9,471 పాఠశాలస్థాపనమై వుండగా 1953 సంవత్సరాంతి వరకు 2,179 పాఠశాలలను స్థాపించడమైనది.

ప్రాథమిక పాఠశాలలను బేసిక్ పాఠశాలలగామార్చాలని, కొత్త బేసిక్ పాఠశాలలను స్థాపించాలని పంచవర్ష ప్రణాళిక నొక్కి చెప్పుతున్నది. కాని సుశిక్షితులైన వారు దొరక్క పోవడంవల్లనూ, మంచి పద్ధతులు, తగిన వాఙ్మయము కొరవడి వుండడం వల్లను బేసిక్ పాఠశాలల స్థాపనకు ఆటంకం కలుగుతున్నది. ఈ లోపాలను తీర్చే ఉద్దేశంతో ప్రతిరాష్ట్రంలోను పైలట్ ప్రాజెక్టుల ప్రారంభానికి పథకం ఏర్పాటు చేసింది కేంద్రం రాష్ట్రాలకు ద్రవ్యం కేటాయించింది.

### విశ్వవిద్యాలయ విద్య

విశ్వవిద్యాలయ విద్యా రంగంలో ముఖ్యమైన విషయం విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమిషన్ స్థాపన. ఈ సంస్థ స్థాపన వల్ల విశ్వవిద్యాల విద్య సమన్వయ భావమున వృద్ధి అవుతుంది. కేంద్ర ప్రభుత్వ పథకంలో చేర్చబడిన సారస్వత పరిశోధన విద్యార్థి వేతనాల స్కీము అమలులోనికి వచ్చింది. రాష్ట్రాలవారి పథకాలు బాగా సాగుతున్నవి. విశ్వవిద్యాలయ విద్యకు కేటాయించిన ధనంలో దాదాపు సగం యిదివరకే వినియోగమైంది.

కేంద్రప్రభుత్వం సాంకేతిక విద్యకు కేటాయించిన 16 కోట్ల 94 లక్షల రూపాయలలో 1951-54 ల మధ్య 5 కోట్ల 44 లక్షల రూపాయలు వ్యయమైనవి. ఖరగ్‌పూరు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో 750 మంది విద్యార్థులు వున్నారు. 1954-55 లో యీ సంఖ్య ఒక వేయికి మించుతుంది. 14 ఇంజనీరింగ్, టెక్నాలజికల్ సంస్థల అభివృద్ధికి విస్తరణకు తగిన పథకాలు 1954-55 లో పూర్తి అవుతవి. వీటిలో బెంగుళూరు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సుకూడా చేరి వున్నది. సాంకేతిక విద్య, శాస్త్రవిద్య, పరిశోధనల అభివృద్ధికి ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషను కృషి చేస్తున్నది. ఈ విద్యాభివృద్ధికి ధారాళంగా గ్రాంట్లు యివ్వడమైనది.

సాంఘికవిద్య ఇంకా ప్రయోగావస్థలో నేవున్నది. ప్రజలను అక్షరాస్యులనుగా చేసే కార్యక్రమాలు, విజ్ఞానిక కార్యక్రమాలూ బాగా సాగుతున్నవి. సాంఘికవిద్యకు సంబంధించిన యితర విషయాలలో అభివృద్ధి అంతగా లేదు.

పంచవర్ష ప్రణాళిక కోరుతున్నట్లు భారతప్రభుత్వం ఇటీవల ఒక వాచకపుస్తకాల పరిశోధన కమిటీని ఢిల్లీలో నెలకొల్పారు. ఇప్పుడు వాడుకలో వున్న వాచకపుస్తకాల నన్నిటినీ పరిశీలించి వాచకపుస్తకాలు వ్రాయడానికి ఆధారభూతములైన సూత్రాలను నిర్వచించడం ఈకమిటీ కర్తవ్యమై వుంటుంది. విద్యావిషయంలోను, వృత్తుల విషయంలోనూ మార్గదర్శకంగా వుండడానికి ఒకకేంద్రసంస్థను స్థాపిస్తున్నాము. రాష్ట్రాలలోగూడా యిట్టి సంస్థలు యేర్పడతవి.

హిందీ మాట్లాడే రాష్ట్రాలవారి సూచనను పురస్కరించుకొని హిందీఉపాధ్యాయుల శిక్షణకు, బేసిక్ శిక్షణ పాఠశాలలలో హిందీ ఉపాధ్యాయుల నియామకానికి, హిందీగ్రంథ భాండాగారాలకు, హిందీ విద్యాలయాల స్థాపనకు గ్రాంట్లు యివ్వనిశ్చయించబడింది. ప్రస్తుత శిక్షణక శాలలలో హిందీశాఖలు యేర్పరచాలని రాష్ట్రీయప్రభుత్వాలను కోరడమైనది. సాంకేతికపదాలకల పుస్తకాలనూ, హిందీమాట్లాడని రాష్ట్రాలవారికి ప్రాథమిక వాచకపుస్తకాలను ప్రచురించడానికి కేంద్రప్రభుత్వం వివరంగా పథకాలు తయారుచేస్తున్నది.

## రాజమండ్రి శ్రద్ధానందఘాట్‌లో సభ

### మూడు పార్టీల పోటాపోటీ

రాజమండ్రి, అక్టోబరు 2: ప్రస్తుతం ఈ నగరంలో బహిరంగసభ జరుపుకొనుటకు తగిన సభాస్థలి ఒక్క శ్రద్ధానంద ఘాటే. ఆంధ్రరాష్ట్ర అవతరణ ప్రథమ వార్షికోత్సవ సందర్భములో, నిన్న సాయంత్రం సభ జరుపుతామని (1) పట్టణ కమ్యూనిస్టు పార్టీ (2) పట్టణ కాంగ్రెసు, యువజనకాంగ్రెస్ (3) పట్టణ ప్రజాసోషలిస్టు పార్టీలవారు ప్రచురణలు చేశారు. ఈ సందర్భంలో మాసభ ముందుజరగాలంటే మాసభ ముందని పోలీసువారివద్ద వీరు వాదించుకున్నట్లు తెలిసింది. పోలీసువారు తమవద్ద శబ్దప్రసారిణ లైసెన్సు కట్టిన వరుసక్రమంలో ఆయా పార్టీలవారు ఒకొక్కరు ఒకొక్కగంట చొప్పున సభను జరుపుకొనే యేర్పాటుకు ఈ మూడుపార్టీలవారిని ఒప్పించినట్లు తెలుస్తున్నది.

ఆ వరుసక్రమ ప్రకారం ముందు కమ్యూనిస్టు పార్టీవారి బహిరంగసభ శాసనసభ్యుడు శ్రీ చిట్టూరి ప్రభాకర చౌదరి అధ్యక్షతను జరిగింది. ప్రజాభిప్రాయానుసారం త్వరలో విశాలాంధ్ర యేర్పడాలని ఆశిస్తున్నామని వారన్నారు.

తర్వాత కాంగ్రెసువారి సభ శ్రీ సలుమూరి పోతరాజుగారి అధ్యక్షతన జరిగింది. శ్రీ మైలవరపు వెంకటశాస్త్రి (అడ్వకేటు) గారు ఈఏడాది పరిపాలనలో ఆంధ్రప్రభుత్వ మెన్నో ఘనకార్యాలు సాధించిందనీ, ఎటాగో కాంగ్రెసు ప్రభుత్వను భంగపరచాలనే దురుద్దేశ్యంతో ప్రభుత్వంచేసిన ప్రతి మంచిపనినీ, వికటంగా చిత్రించిచూపటం ప్రతిపక్షాల కళావైపోయిందనీ, మద్యనిషేధంలో ప్రభుత్వచర్యను సమర్థిస్తూనూ మాట్లాడారు. శ్రీ దామెర్ల వెంకటరావుగారు స్వతంత్రా ప్రభుత్వాన్ని, కాంగ్రెసునూ సమర్థించి, వ్యతిరేక పక్షాలు ముఖ్యంగా కమ్యూనిస్టులు దేశహితాన్ని కోరేటట్లయితే స్వతంత్రా ప్రభుత్వంతో, కాంగ్రెసుతో సహకరించాలన్నారు.

ప్రజా సోషలిస్టు పార్టీవారి బహిరంగ సభ అడిసభాపతిలిని శ్రీ అరుమిల్లి విశ్వేశ్వరరావుగారి అధ్యక్షతను జరిగింది. శ్రీ సుబ్బాల సత్యేంద్రకృష్ణ గారు, బుద్ధవరపు సూర్యనారాయణమూర్తిగారలు విశాలాంధ్రావతరణతో త్వరలో పురోగమించగలమని ఆశను వెలిబుచ్చారు. (స్వ. వి.)

## గనిపట్టణంలో మార్కెట్ ఏర్పాటు

### కొత్తగూడెం డిప్యూటీ కలెక్టరు సిఫార్సు అమలు

కొత్తగూడెం, సెప్టెంబరు 29: గనిపట్టణంలో క్రమబద్ధమైనమార్కెట్టు పద్ధతిని అమలు జరిపించడానికి కొత్తగూడెం డిప్టీ కలెక్టరు అన్సారీగారు పంపిన సూచనలమేరకు రాష్ట్రప్రభుత్వంవారు అసిస్టెంటు చీఫ్ మార్కెటింగు ఆఫీసరు రాజా ప్రతాపరెడ్డి గారిని పురమాయించారు. అన్సారీ గారు అధ్యక్షులుగా ఒక సంఘం ఏర్పాటయింది. ఈ సంఘంలో 6 గురు వ్యవసాయదార్లు, 3 గ్గురు వ్యాపారస్థులూ, గనుల ఆరోగ్యాధికారి డాక్టరు దాసుగారూ ఉన్నారు. ఈ కొత్త పద్ధతి వ్యవసాయదారుయొక్క, వ్యాపారస్థులయొక్క ఉభయుల లాభప్రయోజనాలనూ కాపాడుతుంది. వ్యవసాయదారులకు మంచి ధరలు వచ్చేటట్లు సాయపడుతుంది. మార్కెటులో సప్లయి సమృద్ధిగా ఉండేటట్లు చేస్తుంది. మార్కెటింగు సూపరింటెండెంటుకు తూకం తనిఖీ చేసే అధికారం కూడా ఉంటుంది. అవసరమైతే రాత్రిళ్లు ఉండిపోవడానికి కూడా వ్యవసాయదార్లకు సదుపాయాలు కల్పిస్తారు. స్థానిక రైల్వే స్టేషను చుట్టూ 10 మైళ్ళమేర మార్కెటింగు ప్రాంతంగా ప్రకటింపబడింది. ఇప్పుడు పనులు జరగకుండానూ, అమాయకులైన వ్యవసాయదార్లను రక్షించడానికిన్ని ఈ సంఘంవారే ఒక మధ్యప్రదేశంలో సరుకులను వేలం వేయిస్తారు. తూకం తనిఖీ చేసే పనిలో మార్కెటింగు సూపరింటెండెంటుకు సాయంగా పని చేయడానికి ఒక ఉపసంఘం కూడా ఏర్పాటు చేయబడింది. స్థానిక పరిస్థితుల దృష్ట్యా అనుదిన లావాదేవీలకు ఉపనిబంధనలను ఏర్పాటు చేసే బాధ్యతకూడా సంఘంవారికి అప్పగింపబడింది. (స్వ. వి.)

## "లంకభూములు మంజూరు చేయాలి"

### తూర్పుగోదావరి జిల్లా కలెక్టరుకు విజ్ఞప్తి

కడలి, సెప్టెంబరు 25: పార్లమెంటు సభ్యులు కె. మోహనరావు, శాసన సభ్యులు గంజి నాగేశ్వరరావు గారలు తూర్పుగోదావరిజిల్లా కలెక్టరును 22 వ తేదీన కాకినాడలో కలుసుకొని రాజోలు తాలూకా రాను రాజు లంక ఎస్. ఎల్. సి. సొసైటీకి ఉత్తరభాగం ప్రతిని, మొడిచెర్ల పాలెం సొసైటీకి చిరుగులంకను మంజూరు చెయ్యాలనీ, వరజాడ సొసైటీవారు కోరిన లంకను 800 రూపాయలకు ఇవ్వాలనీ, కోర్ల సొసైటీనుంచి వసూలుచేస్తున్న పాగాకు సెంట్లింపు ఆపుచేస్తూ 'స్టే' ఉత్తర్వు ఇవ్వాలనీ కోరారు.

## రేడియో నెల

### విశేష కార్యక్రమములు

మద్రాస్, మైసూర్, విజయవాడ తిరుచి: అక్టోబరు 6 వ తేదీ రాత్రి 7-45 మనిరి సుబ్రహ్మణ్య అయ్యర్ 9-15 లలిత గీతావళి (హైదరాబాద్ లో మాత్రం 9-30 నుండి) 7 వ తేదీ రాత్రి 7-45 రాగం, పల్లవి: టి. ఎస్. స్వామినాథ పిళ్లై (వేణువు) 8 వ తేదీ రాత్రి 7-45 మధుర మణి అయ్యర్ (హైదరాబాద్ లో రాత్రి 8 నుండి) 13 వ తేదీ రాత్రి 9-15 బృందావన: (సంగీతరూపకం—కన్నడమున).

మద్రాస్, మైసూర్, తిరుచి: అక్టోబరు 8 వ తేదీ రాత్రి 7.45 మైసూర్ వి. దొరస్వామి అయ్యంగార్ (వీణ) 10 వ తేదీ రాత్రి 9-15 'ఒపెన్ హౌస్' (శ్రోతలు పాల్గొను కార్యక్రమం) 11 వ తేదీ రాత్రి 9-15 రాధ, జయలక్ష్మి.

మద్రాస్ హైదరాబాద్ విజయవాడ: అక్టోబరు 15 వ తేదీ రాత్రి 9-30 లలిత గీతము (విజయలక్ష్మి, సుశీల, డాలీ, ప్రమీలాపిళ్లై, సి. రామకృష్ణ శర్మ, షేక్ మహబూబ్).

మద్రాస్. విజయవాడ, తిరుచి: 10 వ తేదీ మ॥ 8 ఎల్. ఎ. సుందరం 11వ తేదీ మ॥8 టి.ఆర్.పాప—వయొలిన్.

మద్రాస్ విజయవాడ: అక్టోబరు 5 వ తేదీ మ॥ 8 వైకం సరస్వతి 6 వ తేదీ మ॥ వినోద కార్యక్రమం (నిర్వహణ) వి. ఎ. రామారావు 10 వ తేదీ మ॥ 8 గీతగోవిందమ్ (జయదేవ) నిర్వహణ: వి. సుందరం అయ్యర్ 12 వ తేదీ మ॥ 8 నీడా మంగళం వి.వి. సుబ్రహ్మణ్యం రాత్రి 9-30 దాలిపర్తి పిచ్చహరి(నాదస్వరం) 10-15 ఎం. బాలమురళీకృష్ణ 13 వ తేదీ మ॥ 8 "అదీ ఇదీ అంతా" (వినోద కార్యక్రమం) రచన, నిర్వహణ: కొప్పరపు సుబ్బారావు రాత్రి 8 పి. లీల 14 వ తేదీ మ॥ 8 30 లలిత గీతము 15 వ తేదీ రాత్రి 7-45 లంక ప్రవాసి (నాటిక) రచన: వింజమూరి శివరామరావు నిర్వహణ: పింగళి లక్ష్మీకాంతం.

## మదరాసు ధరలు

మదరాసు, అక్టోబరు 3:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ

| | |
|---|---|
| పేల్సుటాక్సుతో సహా | రు. 58-4-0 |
| పెట్లొబంగారం తులం | రు. 88 2-0 |
| మూప బంగారు | రు. 86-4-0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. 159-8-0 |
| చిల్లర ధర | రు. 1-10-6 |

### వేరుశనగ

(581 పా॥ 1-కి ఎక్సుకోస్తా సిద్ధంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 112-11-5

| | |
|---|---|
| వేరుశెనగనూనె ఎక్సు పెల్లర్ విలో 8% (500పా.) రెడి చిల్లరధర | రు.221-0-0 |
| కొంకాయనూనె (87½ పౌనులు) | |
| అంబుమార్కు | రు. 80-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 80-8-6 |
| రాజా | రు. 80-0-9 |

### ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పా) | రు. 185-0-0 |

### పంచదార

| | | |
|---|---|---|
| జపాన్ | (66 పా) | 24-8-9 |
| క్యూబాన్ | (100 పా॥) | 36-6-9 |
| క్యూబాన్ | (250 పా॥) | 90-10-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, అక్టోబరు 4: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 157-7-0 |
| బంగారం (1 తు.) | 87-1-0 |
| సావరిన్ | 57-12-0 |

## విజయవాడ మార్కెట్ ధరలు

విజయవాడ, అక్టోబరు 4: ధాన్యం: 166 పా॥ల బస్తా కుసుమ 21 రూ. ఢిల్లీభోగాలు 22-4-0, అక్కుళ్లు 20 రూ. క. 12-21-26-0, 24 నెంబరు రూ.

బియ్యం: 246 పౌనుల బస్తాకుసుమ 49, ఢిల్లీభోగాలు 52, అక్కుళ్లు 48-8-0 క. 12, 50, నెం. 24 56.

వేరుశనగ గింజలు: 177 పౌనులు 43-0-0.

వేరుశెనగపిట్టు :168 పౌనులు13-4-0 రూ.లు మాసె 25 పౌనులు 11-4-0, పెసలు 240 పౌనుల బస్తా 34 రూ. పచ్చ పెసలు 22 రూ. కందులు 20-21 రూ.లు శెనగలు 230 పౌనుల బస్తా 30 రూ.లు ఉలవలు23-0-0,మిర్చి మాయిగు 18-18, బెల్లం 8-4, కొబ్బరికాయలు వెయ్యి 122 రూ.లు, కొబ్బరినూనె డబ్బా 11-4-0, ధనియాలు 90 పా॥ 25 రూ.లు.

## బాలల బాధ్యత

### ఆంధ్ర బాలబాలికల మహాసభలో శ్రీమతి కుసుంత్రివేదీ హితోక్తులు

[ఆంధ్రపత్రిక విలేఖరి]

కర్నూలు, అక్టోబరు 3: దేశ భవిష్యత్తు నేటి బాలలపైనే ఉందంటూ శ్రీమతి కుసుం త్రివేదీగారు నిన్న సాయంత్రం జరిగిన బాలల మహాసభ అధ్యక్ష పీఠంనుంచి ఉద్బోధించారు. దేశసేవకు పాటుపడవలసిందిగా బాలలకు విజ్ఞప్తిచేశారు.

బాలానంద సంఘంవారు ఏర్పాటు చేసిన ఈమహాసభ స్థానిక ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలో జరిగింది. శ్రీమతి కుసుం త్రివేదీగారు హిందీలో మాట్లాడారు. సభకు చాలామంది విచ్చేశారు.

విద్యామంత్రి పట్టాభి రామారావు గారు రాకపోయినందున శ్రీమతి కుసుం త్రివేదీగారే బాలల ద్వితీయ కళా, శిల్ప, గ్రంథాల ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపారు.

సభ జయప్రదంగా జరగాలని కోరుతూ శ్రీమాన్ సి. రాజగోపాలాచారి, మధ్యప్రదేశ్ గవర్నరు డాక్టరు పట్టాభి సీతారామయ్యగార్ల నుంచీ, ఇంకా పలువురు ప్రముఖుల నుంచి సందేశాలు వచ్చాయి. ఇతరులు చేసే పొరపాట్లు మీరు చేయవద్దనీ, ఈమహాసభనూ, ప్రదర్శనాన్నీ అచ్చంగా పిల్లల వ్యవహారంగానే జరిపించమనీ, పెద్దల వ్యవహారంగా చేయవద్దనీ రాజగోపాలాచారిగారు తమ సందేశంలో కోరారు.

వందలాది మంది బాలలు ఏకత్ర చేరి విర్బరమైన ఉత్సాహంతో అనేక విషయాలను చర్చిస్తూ తీర్మానాలు చేస్తూ ఆటపాటలతో కాలక్షేపం చేయడం చూడాలని ఎంతో ఉబలాటమైతే ఉందిగాని ఖుద్దునరాలేకపోయినందుకు విచారిస్తున్నాను అంటూ పట్టాభి సీతారామయ్యగారు తమ సందేశంలో ఉద్బోధించారు.

నేటి బాలలే రేపటి పౌరులుకొబట్టి ప్రజానీక వ్యవహారాల విషయంలో ఇప్పటే వారిలో అభిరుచి కల్పించడం మంచిదన్నారు.

శ్రీమతి కుసుం త్రివేదీగారు తమ అధ్యక్ష ప్రసంగంలో ఇంకా ఇలా చెప్పారు. "మీ అందరికీ నా హార్దమైన ఆశీస్సులు. ఈ అక్టోబరు 2-వ తేదీ యొక్క ప్రాముఖ్యం మీకు తెలిసేవుంటుంది. అదేరోజునసే మనమంతా ఇలా సమావేశమయ్యాము. ఆంధ్రదేశం నలుమూలలనుంచీ ఇంతమంది వత్సలు ఇలా సమావేశమయినారంటే వారి తల్లిదండ్రులకు ఈ మహాసభయందు ఎంత ఆదరమూ, ఆస్థా ఉన్నవో తెలుస్తున్నది. పిల్లల ఈ చిత్ర, శిల్పప్రదర్శనంకూడ చిత్ర, శిల్పకళల్లో ఆంధ్ర బాలలకుగూడ ఎంత నేర్పరితనమున్నదీ, మానసికంగా వారి కల్పనాశక్తి ఎట్టిదయిందీ ప్రత్యక్షంగా ప్రదర్శిస్తున్నది.

ఏపని అయినాపరే కొద్దిమందితో మాత్రమే జరగదు. అందుకు సంపూర్ణమైన సహకారం కావాలి. ఆరోగ్యపుష్టి దేహపుష్టిగల నేటి బాలలే రేపటి ఉత్తమపౌరులు. దేశంయొక్క భద్రతా, శ్రేయస్సూ మీమీదనే ఆధారపడిఉన్నాయి. మీరంతా దేశసేవకు పాటుపడాలి. మీ కందరికీ నా ఆశీస్సులూ, మంగళాశాసనలూ మరోసారి అర్పిస్తున్నాను."

తరువాత బాలల వివిధ వినోద ప్రదర్శనలు జరిగాయి. స్థానిక సెంట్ జోసెఫ్ బాలికోన్నత పాఠశాలకు చెందిన బేబీ సరస్వతి నాట్యప్రదర్శనం గావించింది. మద్రాసు ఆంధ్ర బాలానంద సంఘం సభ్యులు 'శాంతిచక్రం' అనే నాటకం ఆడారు. అందులో చిరంజీవులు లక్ష్మణ్, శ్యామల, ఓగిరాల, రేలంగి సత్యనారాయణలు పాల్గొన్నారు. కడపనుంచి వచ్చిన మాస్టర్ సికందర్, బేబీ కస్తూరీలు 'అనార్కలీ' అనే నాట్యనాటకం ఆడారు. మద్రాసునుంచి వచ్చిన మాస్టర్ చిన్నబాబు ఇంగ్లీషుపాటలు పాడాడు. తుందూ, రామంలు 'బావా. మరదలు' అనే హాస్యనాటిక ప్రదర్శించారు.

### హిందూపురం బాలసంఘం

హిందూపురం, సెప్టెంబరు 27. హిందూపురంతాలూకా పట్టణాల సంఘ సమావేశం శ్రీ డి. కూర్మనాథ్ గారి అధ్యక్షతన నిన్న ఇక్కడ జరిగింది. సంఘాని ఆశ్యకత లను గురించి పలువురు ప్రసంగించారు. తరువాత నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది.

కర్నూలు బాలల మహాసభకు ప్రతినిధులు ఎన్నుకోబడ్డారు. విడప విశాలాంధ్ర నిర్మించాలని ఫజల్ అలీ కమిషన్ వారిని కోరుతూ తీర్మానించారు. బాలసంఘ నిర్మాతలైన బాల అన్నయ్య, అక్కయ్యలను అభినందిస్తూ తీర్మానించారు. పిల్లల చిత్రాలను ఎక్కువగా నిర్మించాలని చిత్ర నిర్మాతలను కోరుతూ మరొక తీర్మానం ఆమోదించారు. ఈ సంఘం తరఫున ఒక గ్రంథాలయం, బీదవిద్యార్థుల నిధి ఏర్పాటుచేయాలని నిశ్చయించారు. అక్టోబరు మాసాంతంలో విహార యాత్ర ఒకటి ఏర్పాటుచేయాలని కూడా నిశ్చయించారు. కార్యదర్శి శ్రీ డి. కూర్మనాథ్ వందనాలతో సభముగిసింది.

---

బళ్లారి, అక్టోబరు 3: బళ్లారి జిల్లా కేరళాంధ్ర సహాయసంఘంవారు నిన్నటి సమావేశంలో, కేంద్ర వరద బాధిత సహాయనిధికి వెయ్యి రూ విరాళంగా యిచ్చుటకు అంగీకరించారు.

## క్వెమోయ్, టాచెన్ దీవుల ఆక్రమణ

### కమ్యూనిస్టు చైనా సంసిద్ధమవుతున్నదట

తైపే, అక్టోబరు 3: చైనా తూర్పు తీరంలో కొమింటాంగ్ అధీనంలో ఉన్న క్వెమోయ్, టాచెన్ ద్వీపాలపై ఒకేసారి దండెత్తటానికి కమ్యూనిస్టు చైనా సేనలు సన్నాహపడుతున్నట్లు కొమింటాంగ్ గూఢచారుల ద్వారా వచ్చిన వార్తలవల్ల తెలుస్తున్నది. క్వెమోయ్‌మీద చైనా కమాండోలు ఒకసారి దెబ్బతీసి వెళ్ళటం, టాచెన్‌మీద విమానాలు విహరించటం జరిగింది.

ఈరెండు ద్వీపాలకూ మధ్య 300 మైళ్ళ దూరం ఉన్నది.

"శత్రువుమీద గట్టి దెబ్బ తీయటానికి మేము సిద్ధంగా ఉన్నాము" అని కొమింటాంగ్ సేనాని జనరల్ చాంగ్ యిటూంగ్ ప్రకటించారు.

## ఈనాం రైతుల రక్షణ చట్టం

### శాసనసభ్యుల ప్రకటన

విశాఖపట్టణం, సెప్టెంబరు 27: విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో మధ్య తరగతికి చెందిన ఈనాందార్లు చాలామంది ఉన్నారనీ, సముంజసమైన ఎట్టి భూ సంస్కరణలకైనా సుముఖులమేననీ, అలాకాకుండా ఒక తరగతివారిని నష్టపరచి, మరొకరిని బాగుచేయటానికి ప్రయత్నించటంవల్ల మరింత క్లిష్ట సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందనీ, రైతు వారీ పట్టాదార్ల విషయమై చేయు భూ సంస్కరణలతో ఈనాం పట్టాదార్లనుకూడా చేర్చవచ్చునీ, ప్రస్తుత ఈనాందార్ల చట్టం ప్రవేశ పెట్టటం మానివేయాలని శాసనసభ్యులు ఆర్. సూర్యనారాయణ, కె. రామమూర్తి, కె. వీరన్న పడాల్ గారలు ఒక సంయుక్త ప్రకటనను చేశారు.

## "మద్యనిషేధం రద్దు కావడం కల్ల"

(1 వ పేజీ తరువాయి)

దానికి శక్తివంచన లేకుండా పాటు పడుతున్నాయనీ, కాని ప్రజల్లో ఒక వర్గంవారు మాత్రం అది చేయలేరు ఇది చేయలేదంటూ కాంగ్రెసును దూషిస్తూనే ఉన్నారనీ, మద్యనిషేధం కాంగ్రెసువారి ముఖ్య విధాయకాల్లో ఒకటి అనీ, ఆ విధానాన్ని మార్చుకోమని కొందరు మిత్రులు ఇప్పుడు ఆందోళన చేస్తున్నారనీ, ఏమైనా సరే ఆంధ్ర ప్రభుత్వం మాత్రం మాత్రం కల్లంగళ్లు తిరిగి తెరవడానికి సిద్ధంగా లేదనీ, ఈ మద్యనిషేధాన్ని ఎత్తివేయించడానికి కమ్యూనిస్టు మిత్రులు కాయశక్తులా ప్రయత్నిస్తున్నారనీ, మద్యనిషేధం అమలులో జరుగుతున్న లోటుపాట్లు తమకు తెలియకపోలేదనీ, కాని అక్కడక్కడా దొంగసారా తయారు సాగుతున్నంత మాత్రాన బీదల పాలిటికి వింటో ఊరటగా ఉన్న మద్యనిషేధాన్ని ఎత్తివేయడం తగదనీ చెప్పారు. మద్య నిషేధం ఎత్తివేతకై సత్యాగ్రహం చేయడం దానిని దురర్థంలో వినియోగించడమేననీ, మంచి పనుల కోసమే సత్యాగ్రహాన్ని వినియోగింపదగునని అన్నారు. ఇప్పుడు సిద్ధాంతాలప్రచారానికి వినియోగించబడేవాటిని సత్యాగ్రహమనగూడదన్నారు: వాటిని దురాగ్రహమనాలనిఅన్నారు. ఇటువంటి సత్యాగ్రహాన్ని ప్రజలు ఆట్టే కాలం సహించ లేరన్నారు. గాంధీజీ ఆచరణరూపేణా బోధించిన సిద్ధాంతాలను అనుసరించవలసిందిగా సంజీవరెడ్డిగారు ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

పిమ్మట పి. తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ, చిన్నప్పటినుంచీ కూడా గాంధీసారస్వతాన్ని చదువుతూవుండాలని ప్రజలకు ఉద్బోధ చేశారు. అన్ని పాఠశాలల్లో, కళాశాలల్లోనూ గాంధీ సాహిత్యం లభ్యంచేయాలన్నారు. గాంధీ ఆదర్శాలను ఉద్బోధించే పుస్తకాలు తయారు చేయించాలన్నారు.

తర్వాత శంకరరెడ్డిగారు మాట్లాడుతూ, ప్రజాస్వామికం జయప్రదంగా సాగిపోవాలంటే, ప్రజలు కార్యశీలంగా ఉండటం మాత్రమే కాదు, అప్రమత్తతతోనూ ఉండాలన్నారు. బాపూజీ భారతీయులను భవ్యంగా తయారుచేశారనీ, సత్యాహింసలమార్గం వారికి చూపెట్టారనీ, ఆ సిద్ధాంతాల మీద నడుస్తున్న ప్రభుత్వాన్ని బలపరచడం ప్రతివానికీ విధాయకమైయున్నదని ఉద్బోధించారు.

---

### చెన్నపురి ఆంధ్ర మహాసభ

మదరాసు, అక్టోబరు 4: చెన్నపురి ఆంధ్ర మహాసభవారు రేపు 6 వ తేదీ సా 6 గంటలకు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారికి సన్మానపత్రము శాలువ సమర్పిస్తారు శ్రీ కొంతి వెంకటరామమూర్తిగారు అధ్యక్షత వహిస్తారు.

## భూమిశిస్తుపై సర్ చార్జి

(1 వ పేజీ తరువాయి)

బుచ్చవచ్చు. త్వరలో జిల్లా పంచాయతీ కవున్సిల్లో నెలకొల్పాలని ప్రభుత్వం నిర్ణయించింది. బహుశః ప్రతి గ్రామం పంచాయతీపాలన క్రిందకు వస్తుంది. మినహాయింపు జరిగిన భూమి రెవిన్యూస్థానే క్రొత్తపన్నులు విధించబడవచ్చు. అపరిమితివరకు ప్రభుత్వమునకు భారంగా వున్న ఆర్థిక వ్యవహారాలు కొన్ని వదలిపోగలవు.

అభివృద్ధిపన్ను, వాణిజ్య పంటలపై పన్ను, నీటి తీరువ హెచ్చింపు అమలుకం పన్ను అవకాశాల విస్తరణలతో యీ ఏడాది కోటి రూపాయల లోటును భర్తీచేయాలని ప్రభుత్వం అనుకున్నది. కాని యింతవరకు అది జరుగలేదు. పోనీ అభివృద్ధిపన్ను విధింపును శాసనం చేయదలచినా యీ ఏడాదిమాత్రం ప్రభుత్వానికి దమ్మిడీ లభించదు. నీటితీరువ హెచ్చింపుకు కోస్తా శాసనసభ్యులు, వాణిజ్య పంటలపై పన్నులకు రాయలసీమ శాసనసభ్యులు అంగీకరించగలరని అనుకున్నా యీ రెండూ అసెంబ్లీ లో విరూపం దాలుస్తాయో చూడవలసివున్నది. క్రొత్తపన్నుల విధింపును, ఉన్నపన్నుల హెచ్చింపును, అసెంబ్లీ యింతవరకు విముఖత సూచించింది. లోటు కొనసాగినా ఏ రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక స్థితియైనా మరీ హీనంగా మారిపోక పోవచ్చుగాని యీ కోటి రూపాయల లోటును యీ ఏడాది 2 కోట్ల 90 లక్షల లోటుకు కలుపుకుంటే మొత్తం దాదాపు 4 కోట్లు లోటు కనిపిస్తుంది.

మద్రాసు రాష్ట్రంనుంచి రావాల్సిన బకాయిలగూర్చి ఆందోళనచేసే బదులు కేంద్రంనుంచి యింకా ఎక్కువ సహాయం కోరమని ఆంధ్రప్రజలకు శ్రీ శైలావహాధ్కట్జూ అంధ్రరాష్ట్రబిల్లుపై చర్చ సందర్భంలో కోరివున్నారు. ఇది యిప్పుడు పూర్తిగా కార్యరూపం దాల్చవచ్చు.

సర్ ఛార్జీలు విధించాలనీ, రెవిన్యూ, నీటితీరువలు పెంచాలనీ, వ్యవసాయ ఆదాయాలపై పన్నువిధించాలనీ, ప్రభుత్వ ప్రతినిధులు తరుచు చెపుతూనేవున్నారు. కనుక వాటిల్లో ఏదో వకటి ప్రభుత్వం చేయవచ్చని తేలికగా వూహించవచ్చు. కాని ఏదో వటిలో వకదానిని అమలుపరిస్తే ధనిక భూస్వాములు గనుక తగినసంఖ్యలో లేకపోయినట్లయితే, మధ్య తరగతి రైతులు కూడ పన్నులలో కొంత బాధ్యత వహించాల్సి వుంటుంది. నీటితీరువ హెచ్చింపు కూడ జరిగితే, బహుశా వారిలో శిస్తు మినహాయింపు సౌకర్యం పొందినవారు కూడ తిరిగి యీ పన్ను (నీటితెరువ హెచ్చింపు) కిందవస్తారు. ఎందుకనగా నీటతెరువ హెచ్చింపుభూమి శిస్తు చెల్లింపు మొత్తాన్ని ఎక్కువచేస్తుంది.

ప్రస్తుతమిచ్చిన సౌకర్యం మంచిదే. కాని ఖజానాపై దీని ఫలితాలు పడగలవు. ప్రభుత్వం చేస్తున్న, చేయాలనుకుంటున్న అనేక పనులకు గాను నిధులు సమకూర్చవలసిన బాధ్యత ను ఎక్కువ చేయగలదు. ఈ ప్రకటన చేసేముందు ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు (రాబడికి) కూడ ఆలోచించవలసింది.

మన పన్నుల విధింపు మార్గాలు పెద్ద మార్పులు చేయడానికి వీలైనటువంటివి. ప్రధానమైన మార్గం భూమి పన్ను. పన్నుల వసూళ్లవిధానంకూడా చాలా పొదుపుగా వుంటుంది. అనేక పనులు చేసే సిబ్బందియే వినియోగించబడలేదు. మోటారు శకటాల పన్ను గరిష్ఠ పరిమితిలో వుంచారు. అమ్మకం పన్నుకూడ కొంచెం పెద్ద మొత్తమే. అయితే యిది వర్తింపజేసే విభాగాలు ఎక్కువ చేయవలసి వున్నది.

కాని వాణిజ్య పన్నుల విషయంలో కూడా సరిగా విధించి నిక్కచ్చిగా వసూలు చేసే చర్యలగురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు తోచదు. ఇక మున్సిపల్ పన్నులు వున్నాయి. వీటిని విధించడంలో చాలా అవకతవకలున్నాయని అంతా అంగీకరించిందే వసూళ్లు కూడ అధ్వాన్నంగా వున్నాయి. భూమి పన్ను మాత్రమే పూర్తిగా వసూలు చేస్తున్నారు. వాణిజ్యపన్నులు, మున్సిపల్ పన్నులు సరిగా వసూలు చేస్తే ఖజానాకు చాలావరకు మేలు.

రైతులకు ప్రభుత్వం సహాయం చేయాలనుకుంటే పరిపాలన సరిగా వడవాలంటే, పరిపాలనా రంగంలో చాలా పొదుపుగా వుండాలి. దీనికి సిబ్బందిని తొలగించడమే అవసరమని కాదు, కాని పబ్లిక్ వర్క్సు శాఖవారు చేసే కొన్ని ఖర్చుల విషయమై మొదలంట పునః పరిశీలన జరపాలి, సంస్కరించాలి. తనిఖీకూడ వుండాలి. కాని సత్ఫలితాల సాధించగల సంస్కరణల కవసరమైన ప్రక్రమ, సరియైన పరిపాలన విషయమై ప్రభుత్వం ఇంతవరకు శ్రద్ధచూపుతున్నట్లు తోచదు.

(స్వ. వి.)

## పెద్ద భూస్వాములపై ఎక్కువ పన్నులు?

కర్నూలు, అక్టోబరు 3: పది రూపాయలు అంతకులోపు భూమిశిస్తు చెల్లించే పట్టాదారులను పూర్తిగా మినహాయించినందువల్ల బడ్జెట్ లో ఏర్పడే పెద్ద లోటును భర్తీచేయడం ఎలాగ అనే సమస్య ఇప్పుడు ఆంధ్ర ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నది.

## జనగాం రైలు ప్రమాదం

### విచారణ ప్రారంభం

హైదరాబాదు, అక్టోబరు 4: జనగాం రైలు ప్రమాదంపై విచారణ ఇవాళ జనగామలో ప్రారంభమయింది. రైల్వేల గవర్నమెంటు ఇన్స్పెక్టరు యస్. యస్. నారాయణగారు విచారణ అధ్వర్యంవహించారు. నెలాఖరు లోపల ఆయన తన నివేదిక సమర్పించగలరని భావింపబడుతున్నది. ఈలైనుపైన మళ్లీ ఇటువంటి ప్రమాదాలు జరగకుండా ఈయన తన నివేదికలో కొన్ని సూచనలు చేస్తూ పలుకబోయిస్తాడట. రైల్వే ఉద్యోగులనుంచి, ప్రయాణీకుల నుంచి; సైనికులనుంచి, ప్రజలనుంచి కూడ ఆయన సాక్ష్యంతీసుకొంటాడు. ఈవిచారణ సందర్భంగా సికిందరాబాదునుంచి రైల్వే ఉన్నతోద్యోగులు జనగామకు తరలివెళ్లారు. సెంట్రల్ రైల్వే చీఫ్ ఇంజనీయరు యమ్. తాడానిగారు ప్రమాద స్థలిలోనే ఉన్నారు. 27 తేదీనుంచి ఆగిపోయిన సరాసరి రాకల పునరుద్ధరణ కార్యక్రమంలో ఆయన నిమగ్నులై ఉన్నారు. (యు. పి. ఐ.)

## భారతదేశంలో నిమ్న జాతుల స్థితి

### రాజభోజ్ ప్రకటన

ఆగ్రా, అక్టోబరు 4: స్వాతంత్ర్యం వచ్చిన నాటినుంచి దేశంలో నిమ్న జాతుల స్థితిగతులు అభివృద్ధి చెందలేదని షెడ్యూల్డు కులాల సమాఖ్య కార్యదర్శి పి. యన్. రాజ్ భోజ్ నేడిచట ఒక బహిరంగసభలో మాట్లాడుతూ అన్నాడు. వీరిపట్ల భారత ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ వహించాలని కోరుతూ యిలా జరగకపోయినట్లయితే యీ సమస్యను సమితి ముందు పెట్టవలసి వస్తుందని కూడా రాజ్ భోజ్ ప్రకటించాడు.

## కర్నూలు జిల్లా హైస్కూళ్లలో కోర్సులు

### జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరు లేఖ

(స్వకీయవిలేఖరి)

మార్కాపురం, సెప్టెంబరు 30: మార్కాపురం, యెమ్మిగనూరు, చాగలమర్రి ఉన్నతజిల్లాబోర్డు పాఠశాలలో ఇంజనీరింగు కోర్సు, కంభం, ఆళ్ళగడ్డ ఉన్నతపాఠశాలలలో వ్యవసాయ కోర్సు, కోయిలకుంట్లలో బోధనా శిక్షణ, ఆత్మకూరులో సెక్రటేరియల్ కోర్సులను 1955-56 సంవత్సరంనుంచి ప్రవేశపెట్ట ఉద్దేశించినట్లు, అందుకు ప్రజలు విరాళాలుఇచ్చి, ఈ ప్రణాళికను జయప్రదమొనర్చాలని కోరుతూ కర్నూలు జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరు ఇక్కడకు పంపిన ఒక లేఖలో వివరించారు.

---

## భారత వైమానిక దళ డిప్యూటీ చీఫ్ కమాండర్

హైదరాబాద్, అక్టోబరు 1: ఇండియా వైమానికదళ డిప్యూటీ చీఫ్ కమాండరు ఒక ప్రత్యేక ఐ. ఏ. ఎఫ్. డకోటా విమానంలో ఇవాళ ఉదయం ఇక్కడకు వచ్చారు. బీగంపేట విమానాశ్రయంలో కెప్టెన్ రంజన్ దత్ నెం. 1-వ భారత వైమానిక దళ అకాడమీకి చెందిన సీనియర్ ఉద్యోగులు ఆయనకు స్వాగత మిచ్చారు.

బీగమ్ పేట, హకీమ్ పేటలోని అకాడమీలను సందర్శించవలసి ఉంటుంది. రేపు తిరిగి ఢిల్లీకి బయలు దేరుతారు.

---

సర్వేపు, తదితర ఈనాములపై రైత్వారీ భూములపై మాదిరిగా ఎక్కువ శిస్తున్న విధించాలనే సూచన వున్నట్లు తెలుస్తున్నది. దీనిద్వారా రు. 40 లక్షలవరకైనే రాబట్టవచ్చునట.

ఇక వాణిజ్యపంటలపైన, ఒకరకపు చెరుకుపైనకూడ పన్ను విధించవచ్చునీ, కనీసపరిమితి నిర్ణయించి భూమి రెవిన్యూ చెల్లించవచ్చునికూడ తెలుస్తున్నది.

ధనికులకు, పెద్ద భూస్వాములకు మాత్రమే వర్తించే విధంగా యీ హెచ్చింపు జరుగవచ్చునట.

ఇక రైతుల ఇబ్బందులు తీర్చడంతో పాటు, ప్రైమరీ పాఠశాలల ఉపాధ్యాయుల స్థితిగతుల నభివృద్ధి చేయడం కూడ ప్రభుత్వం ఆలోచిస్తుంది. మంత్రుల వాగ్దానాలు నిలబెట్టుకోవలసి వున్నది గనుక, ఎలిమెంటరీ స్కూల్ ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపును గూర్చి కుప్పుస్వామి కమిటీ నివేదికననుసరించి త్వరలో ఒక నిర్ణయానికి రావచ్చు. దీనితో లోటు యింకా ఎక్కువవుతుంది.

పాఠ్యపుస్తకాల ప్రచురణ బాధ్యత ప్రభుత్వం వహిస్తే అదనపు ఖర్చులో కొంతభాగం కలిసి రావచ్చుని అంటున్నారు.

ఈ నెలాఖరులోగా సమావేశమయ్యే శాసనసభ కాంగ్రెసు పక్షం రాష్ట్ర ఆదాయం పెంచడానికి మార్గాలు పరిశీలిస్తుంది. ఒకటి మాత్రం ఖాయం. అదేమిటంటే ధనికులు యెక్కువ చెల్లించడం, పేదలు కొంచెం తక్కువ చెల్లించడం, దీనిద్వారా శీఘ్రంగా సాంఘిక న్యాయం ప్రసాదించబడవచ్చు.

(యు. పి. ఐ.)

## స్థానిక సంస్థల పన్నుల విధి సద్వినియోగ బాధ్యత

### ప్రొద్దుటూరు సభలో ప్లానింగ్ మంత్రి సంజీవయ్యగారి సలహా

ప్రొద్దుటూరు అక్టోబరు 3: ఈ పట్టణంలో గల ఒకే ఒక పురపాలక ఉన్నత పాఠశాల భవనాల కొరత ఉంది. విద్యాభ్యాసంలో నిరాదరణ గోచరిస్తోంది. ఇది మంచిదికాదు. స్థానిక సంస్థల పన్నుల విధి ఈ జిల్లాకు ఉంది. ఈ నిధిని శ్రేయోదాయకమైన పనులకు ఖర్చుచెయ్యాలి. ప్రభుత్వం సగం విరాళం భవన నిర్మాణికి ఇస్తే, ప్రభుత్వం ఈ నిధినుంచి మిగతా సగం భరిస్తుంది" అని మంత్రి డి సంజీవయ్యగారు ఇవాళ ఇక్కడ సూచించారు,

కడపజిల్లా జడ్జి శ్రీ జె. సాంబశివ రావు చౌదరిగారు సమావేశమునకు అధ్యక్షత వహించారు. ప్రత్యేకాహ్వానంపై సేవాసదన పాఠశాల వ్యవస్థాపకురాలు శ్రీమతి జె. శీతా మహాలక్ష్మమ్మగారు విచ్చేసారు.

కడపజిల్లా కలెకరు శ్రీ హెచ్. సాంబమూర్తిగారు, అన్నిశాఖలజిల్లా అధికారులు, పట్టణ ప్రముఖులు పెక్కురు హాజరైనారు.

ప్లానింగు మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు సేవాసదన పాఠశాలకు రాగానే పరిపాలనా సమితి అధ్యక్షులు శ్రీ సోమిశెట్టి కృష్ణమూర్తిగారు పాఠశాల కార్యదర్శి శ్రీ కె. య. సుబ్బరావుగారు మంత్రిగారి కి స్వాగతమిచ్చారు.

శ్రీ కె. యస్. సుబ్బరావుగారు స్వాగతమిస్తూ యీ పాఠశాల కనుబంధముగ నడుపబడు చున్న హరిజన బాలికల వసతి గృహం చక్కగా తమశక్తి వంచన లేక నడుపుచున్నామనీ, యిట్టి సంస్థలు సక్రమంగా కొనసాగవయున్నచో ఆర్థిక సహాయం ప్రభుత్వ సహాయమెంతేననిఅవసరమనిఅన్నారు అధ్యక్షులు శ్రీ జె. సాంబశివరావు చౌదరిగారు ప్రసంగిస్తూ కీ॥ శే॥ కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు తదితర వైశ్య ప్రముఖుల సహకార సుహృద్భావములవల్ల నాడు చిన్నగా ప్రారంభింపబడిన పాఠశాల దినదినాభివృద్ధి నొందుచు, నేడు యిట్టి ఉన్నతి స్థితి పొందియున్నదనీ, ఆర్యవైశ్య సంఘం వారు బాపూజీ ఆశయానుసారముగ హరిజన బాలికల వసతి గృహం స్థాపించటం శ్లాఘనీయమని నుడివారు.

సేవాసదన పరిపాలనా సమితి అధ్యక్షులు శ్రీ సోమిశెట్టి కృష్ణమూర్తిగారు మంత్రిగారికి విజ్ఞాపనా నివేదికను సమర్పిస్తూ హరిజన హాస్టలుకు ప్రత్యేక భవననిర్మాణానికీ, పాఠశాల విద్యార్థులకు ప్రత్యేక క్రీడాస్థలం ఏర్పాటుకు గ్రాంటును మంజూరు చెయ్యాలనీ, హరిజన హాస్టలుకు అదనంగా కనీసం 50 బాలికలకు గ్రాంటు మంజూరు చెయ్యాలనీ కోరారు.

### మంత్రిగారి ఉపన్యాసం

మంత్రి శ్రీ డి. సంజీవయ్యగారు యిలా ప్రసంగించారు:

"యీ పట్టణం కడప మండలమునకే గాక యావదాంధ్ర దేశానికి ఆదర్శప్రాయముగ నున్నట్లున్నది. లక్ష్మీదేవి యీ పట్టణములో నివాసం చేస్తున్నది. అలాగే సరస్వతీ దేవికూడ నివాసం కావాలి. యీ పట్టణంలో ఒకే ఒక ఉన్నతపాఠశాల యున్నది. యిది పురపాలక సంఘ యాజమాన్యములో యున్నది. భవనముల కొరతవల్ల క్లాసులు షిఫ్టుపద్ధతిపై జరుపబడుచున్నది. విద్యాభ్యాసములో యింత నిరాదరణ యెందుకో నాకు గోచరించటమున్నది. అన్ని రంగాలలో ఆర్థిక మాంద్యం ఏర్పడిన మాట నిజమేగాని శ్రద్ధాశక్తులు, పట్టుదల యున్నచో ఎట్టి కష్టసాధ్యమైన కార్యములు నెరవేరును. ఉన్నతి పాఠశాల భవన నిర్మాణమునకు అవకాశములు మెండుగా యున్నవి.

ఇటీవలనే అఖిల భారత సాంఘిక సంక్షేమ బోర్డు నెలకొల్పబడింది. శ్రీమతి దుర్గాబాయమ్మగారు అధ్యక్షురాలు. కొన్ని సంస్థలకు అప్పుడే సహాయం చేయబడింది. మీ కుకూడ సహాయం తప్పక లభించగలదు. సేవాసదనబాలికలు నృత్య ప్రదర్శనం సలిపారు. మంత్రిగారి గౌరవార్థం సేవాసదన పరిపాలనా సమితి వారు అల్పాహారవిందు నిచ్చారు.

## ఫ్రాన్సు రక్షణశాఖ రహస్యాలు

### చేరవేసినట్లు జర్నలిస్టు అంగీకారం.

పారిస్, అక్టోబరు 3: ఫ్రాన్సు జాతీయరక్షణ వ్యవహారాలకు సంబంధించిన రహస్యాలను ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీకి తాను చేరవేసినట్లు ఇక్కడి కమ్యూనిస్టు పత్రికా రచయిత ఆండర్ బారవే ఇవాళ ఫ్రెంచి ప్రభుత్వ అధికారుల సమక్షాన అంగీకరించాడు.

ఫ్రెంచి జాతీయ రక్షణ మండలి రహస్యాలను బయటకు అందిచ్చిన ఇద్దరు ఉన్నతాధికారులు కూడా అరెస్టు అయి ఉన్నారని ఇక్కడ ఒక అధికారి చెప్పారు.

## అభివృద్ధి సంఘ సమావేశం

### ఢిల్లీకి రమ్మని ప్రకాశం గారికి ఆహ్వానం

కర్నూలు, అక్టోబరు 4: న్యూఢిల్లీలో నవంబరు 9, 10 తేదుల్లో ప్రధాని నెహ్రూ అధ్యక్షతను జరగనున్న జాతీయాభివృద్ధి కౌన్సిలు సమావేశానికి రావలసిందిగా ముఖ్యమంత్రి ప్రకాశం గారికి పిలుపువచ్చింది.

ఆ సమావేశానికి అన్ని రాష్ట్రాల ముఖ్య మంత్రులూ ఆహ్వానింపబడ్డారు. రాష్ట్రాలలోని డెవలప్మెంటు కమిషనర్లు అందరినీ కూడ రమ్మన్నారు. ఆ సమావేశం 8 వ తేదీ మొదలు 11 వ తేదీవ జరుగుతుంది. 8 వ తేదీన ప్రాథమిక సమావేశం జరుగుతుంది.

పంచవర్ష ప్రణాళికలో ఇంతవరకూ జరిగిన అభివృద్ధి సమాజవికాస కార్యక్రమాలు, జాతీయ విస్తరణ కార్యకలాపాలు, భూమి సంస్కరణలు, ఉద్యోగ పరిస్థితి చక్కబాటుఇత్యాదులు ఎంతెంత ముందుకు వడిచిందీ ఈ సమావేశంలో చర్చించ బడేటట్లు తెలుస్తున్నది. (స్వ. వి.)

## గుంటూరు జిల్లా కాంగ్రెసు సమావేశం

తెనాలి, అక్టోబరు 2: గుంటూరు జిల్లా కాంగ్రెసు కార్యవర్గ అత్యవసర సమావేశం 6-వ తేదీన సాయంత్రం 2 గంటలకు తెనాలిలోని శ్రీ చంద్రమౌళిభవనంలో జరుగుతుందని ప్రధాన కార్యదర్శి చుండి రామమూర్తిగారు ప్రకటిస్తున్నారు.

### శ్రీ కన్యకాపరమేశ్వరీ నవరాత్రి ఉత్సవాలు

మదరాసు,అక్టోబరు 4: శ్రీ కన్యకాపరమేశ్వరి నవరాత్రి ఉత్సవాల సందర్భమున కొత్వాలు బజారులోని శ్రీ వాసవాంబ దేవాలయంలో రేపు సా. 5-30 గం శ్రీ కమల విమల సంగీత కచ్చేరిరాత్రి బంగారుశేడియమునల్లుండి 6 వ తేదీ రాత్రి 9 గం నుండ ప్రవేశము జరుగుతుంది.

### దుకాణాల దట్టం

మదరాసు, అక్టోబరు 3: తిరుపతి శ్రీ వెంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవం సందర్భమున అక్టోబరు 1 నుండి 10 వ తేదీవరకు తిరుపతి మునిసిపాలిటీలోనుండే అంగళ్లు సంస్థలకు మదరాసు అంగళ్లు సిబ్బందిచట్టం సెక్షనులు 7(1) 11 (1)13(11)వరకులువర్తింపకుండా మినహాయింపు నొసగినట్లు ఆంధ్రప్రభుత్వ కార్మిక కమిషనరు శ్రీ పి. అర్ రెడ్డిగారు ప్రకటిస్తున్నారు.

### వరద బాధితులకు వస్త్ర సహాయం

మదరాసు, అక్టోబరు 4: బీహారు బెంగాలులలో వరదలకు గురియైన బాధితుల సహాయార్థం కమ్యూనిస్టు పార్టీవారు నిన్న జార్జిటవును చింద్రాదిపేట లందు 350 వస్త్రాలు నగదు రూ 68-7-0 వసూలు చేశారు. పార్టీ సభ్యులందరూ యీరీతిగా యిండ్లకు వెళ్లి పెబ్బును వస్త్రాలను వసూలు చేయాలని ఆదేశింపబడి యున్నారు.-ఈ వసూళ్లు కలకత్తా బౌబజారు వీధి నెం 249 గృహంలోగల ప్రజాసహాయ్య కమిటీకి పంపబడుతుంది.

## విజయవాడలో ఒకని దుర్మరణం

విజయవాడ, అక్టోబరు 3: కటికి నేని అంజనేయులు (18) అనునతను 1 వ తేదీ సాయంత్రం ప్రకాశం విగ్రహందగ్గర సిటీబస్సుక్రింద ప్రమాదవశాత్తు పడి బలమైన గాయాలతో ఆసుపత్రిలో చేర్చబడి కొద్దిగంటలలో మరణించాడు. (స్వ. వి.)

## హరిజనుల గృహ వసతికి పట్టాలు

### ఆలూరుతాలూకాలో కలెక్టర్‌కు విజ్ఞప్తి

ఆలూరు, సెప్టెంబరు 30: కర్నూలుజిల్లా కలెక్టర్ జనాబ్ సయ్యద్ అహమ్మద్, ప్లానింగ్ ఆఫీసరు గిల్లి నారాయణశెట్టిగారలు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, వారి బృందం 28 తేదీ అటకలగుండునుండి ఇక్కడకు వచ్చారు. రహదారి బంగాళా వద్ద పంచాయితీ అధ్యక్షులు ఎస్. బి. వీరప్పరెడ్డి, పాపన్న చౌదరి,బి. భీమసేనాచార్యులుగారలు, తదితర ఉద్యోగులు వారికి స్వాగతమిచ్చారు. వీరప్పరెడ్డి, పాపన్న చౌదరి, భీమసేనాచార్లు గారలు ఆలూరులోని హరిజనులకు ఇండ్లవసతికి పట్టాలు మంజూరుచెయ్యాలని విజ్ఞాపనపత్రాలు సమర్పించారు. తర్వాత కలెక్టరుగారు ముద్దనగౌరి గ్రామం వెళ్లారు గోవిందరెడ్డిగారి అధ్యక్షతన బహిరంగ సభజరిగింది. తర్వాత హాలహర్వి గ్రామం వెళ్ళారు. అక్కడ ప్రసూతి చికిత్సాలయానికీ, పశువైద్యశాలకు శంకుస్థాపన చేసిన తర్వాత బహిరంగ సభలో పంచాయితీ తరఫున భూపాల వీరన్న గౌడుగారు స్వాగత పత్రాన్ని సమర్పించారు. పాపన్న చౌదరిగారు పంచవర్ష ప్రణాళికను వివరించారు. అక్కడనుంచి ఆలూరుకు బయలు దేరారు. దారిలో ఎల్లార్తి గ్రామంలో దరగాను (మసీదు లాటిది) సందర్శించారు. పంచాయితీ అధ్యక్షులు ఉత్సవ తరులు దరగా పెద్ద యాత్రా స్థలమనీ, ఉరుసు సమయంలో లక్షలాది ప్రజలువస్తారనీ, యాత్రికులకు ఎక్కువ సౌకర్యాలు కలిగించాలనీ విజ్ఞాపన పత్రం సమర్పించారు.

ఆలూరులో ఉదయం 7-30 గంటలకు హత్తిబెళగల్లు, కర్ణగౌరి గ్రామాలమధ్యలో కల్వంక చప్టావంతెన (కాజ్ వే), కు శంకుస్థాపనచేశారు. వీరారెడ్డిగారు స్వాగతమిచ్చారు. తర్వాత నగరదోణ గ్రామంలో గ్రంథాలయానికి ప్రారంభోత్సవం జరిపారు. పంచాయితీ తరఫున ఎన్. తిమ్మారెడ్డి గారు సన్మాన పత్రం సమర్పించారు. గ్రంథాలయ భవన నిర్మాణానికీ, విద్యుచ్ఛక్తి సరఫరా స్కీముకు ప్రభుత్వం తోడ్పడాలని విన్నవించారు. నమకల్లు గ్రామానికి వెళ్ళగానే శీతారామరెడ్డి, రాఘవరెడ్డిగారలు స్వాగత మిచ్చారు. పశువు మందిరానికి శంకుస్థాపనచేశారు చిప్పగిరిలో ప్రసూతి ఆస్పత్రికి శంకుస్థాపన చేశారు. వైకుంఠం లక్ష్మన్న, విరూపాక్షిరెడ్డిగారలు కలెక్టరుకు స్వాగతమిచ్చారు.

ఆలూరు తాలూకాలో 2 రోజుల పర్యటన ముగించుకుని గుంతకల్లుకు కలెక్టరుగారు వెళ్ళారు. ఓ. వి.

---

విజయవాడ, అక్టోబరు 4: విజయవాడ ఆలిండియా రేడియో కేంద్రం నుంచి 6 వ తేదీరాత్రి 7-30 గంటలకు ఖాదీ ప్రాముఖ్యాన్ని గురించి తెలుగులో డాక్టరు బి. పట్టాభిసీతారామయ్యగారి ప్రసంగాన్ని ప్రసారంచేస్తారు.

## దక్షిణ రైల్వే

ఇండియన్ రైల్వేల 1890 ఆక్టు IX లోని నెం. 55 & 56 సెక్షనుల ప్రకారం వేలం అమ్మకం నోటీసు:—

పిఠాపురం రైల్వేస్టేషనులో డెలివరీ లేక నిల్వవుండిపోయిన దిగువ వివరించిన సరకులు 1954 అక్టోబరు 20 తేదీ బుధవారం మధ్యాహ్నం 3 గం॥ లకు, సదరు సరకు రైల్వేవారికి చెందవలసిన అన్ని ఛార్జీలు చెల్లించి కన్సైనీ డెలివరీ తీసికొనిననేగాని, బహిరంగ వేలములో విక్రయింపబడును. వేలములో పాల్గొనదలచినవారు సదరు సరకులను వర్కింగు గంటలలో తనిఖీ చేసికొని తృప్తిచెందవచ్చును. అట్లు తనిఖీ చేయదలచుకొన్నవారు స్టేషన్ మాస్టరుగారికి ముందుగా తెలియపర్చవలెను. పిఠాపురం స్టేషన్ మాస్టరుగారికి యిట్టి తనిఖీలకు కోరువారికి తగిన యేర్పాటుచేయవలసినట్లు వుత్తర్వులు గలవు.

కన్సైన్మెంటు:

ఒకవాగను బరువు బొగ్గు (సుంద్రం) ఎంటరుకాకుండా పడియున్నది.

షరతులు:

రొక్కము వెంటనే చెల్లించవలెను.

పాటపాడినతరువాత, హెచ్చుపాటదారు, సరకు నాణ్యత, తూకములలో లోపము లున్నవనిగాని, లేక మరే లోపములైననుగలవనిగాని డెలివరీ తీసికొనక నిరాకరించుటకు వీలులేదు.

బెజవాడ, 29.9.54. — డిస్ట్రిక్టు ట్రాఫిక్ సూపరింటెండెంటు.

# ఆంధ్ర ప్రభుత్వ మద్యనిషేధ విధానం

## కర్నూలు జిల్లా కాంగ్రెసు సంఘ తీర్మానం

కర్నూలు,అక్టోబర్ 2: మద్యపాన నిషేధ విషయంలో ఆంధ్ర ప్రభుత్వం వారు అవలంబిస్తున్న వైఖరిపట్ల తమ అసమ్మతిని తెలుపుతూ కర్నూలు జిల్లా కాంగ్రెసు సంఘ సర్వసభ్యసమావేశంలో నిన్న ఇక్కడ తీర్మానం చేయబడింది. సమావేశానికి శ్రీ పి. వెంకటసుబ్బయ్యగారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు పిడతల రంగారెడ్డి,యన్. శంకరరెడ్డిగారలు ప్రత్యేకాహ్వానంపై హాజరైనారు. నిషేధంలో విశ్వాసం ఉన్నవారినే ఉద్యోగులుగా నియమించాలని, అవసరమైతే అందుకుగాను ఒక చట్టం ఆమోదించాలని, కనీసం ఈ పద్ధతి ప్రకారం ఒక జిల్లాలోనైనా చేసి చూడాలని వారు ప్రభుత్వానికి సూచించారు.

జిల్లాలో పర్యటించి, వివిధ కాంగ్రెసు సంఘాలను సంస్కరించి పటిష్ఠపరచేటందుకుగాను శ్రీ పి. వెంకటసుబ్బయ్య, పి. రంగారెడ్డి, యన్. శంకరరెడ్డిగారలతో ఒక సంచార సంఘం నియమించారు. జిల్లాలో భూదాన యజ్ఞసంచాలకుడుగా నియమించబడిన డి. వెంకటరత్నంకు అనుకొన్న పరిమితికి భూమి సంపాదించే కృషిలో సహకరించాలని సభ్యులను కోరుతూ ఒక తీర్మానం ఆమోదించారు. చిన్నహుత్తివద్ద హంద్రీ పైన ఒక వంతెనను, ఆరునెలల క్రితం జిల్లా బోర్డువారు పని చేస్తూ నిలిపివేసిన నల్లివాగుపై వంతెనను నిర్మించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానంచేశారు. ఈరెండు వంతెనలు, కర్నూలు బళ్లారి రోడ్డుపైన ఉన్నాయి.

పత్తికొండ తాలూకాలో 64 లక్షల రూపాయల వ్యయంతో, 12,000 ఎకరాలకు లాభించే గార్లదిన్నె ప్రాజెక్టును మంజూరు చేయనందుకు విచారం తెలుపుతూ కూడా వారు తీర్మానించారు. ప్రారంభంలో మద్దూరి అన్నపూర్ణయ్యగారి మృతికి జనగాం ప్రమాదంలో చిక్కుకున్న వారిమృతిపట్ల తమ గాఢసంతాపం ప్రకటిస్తూ తీర్మానం చేశారు.

## గొల్లప్రోలు పంచాయతి

కర్నూలు, అక్టోబరు 1: గొల్లప్రోలు పంచాయతీ అధ్యక్షుని తొలగిస్తూ తాము చేసిన ప్రకటనను స్థానిక సంస్థల ఇనస్పెక్టరురద్దుచేసుకున్నారు. ఆంధ్రా హైకోర్టువారు జారీచేసిన ఉత్తరువు దృష్ట్యా ఈచర్య తీసుకోబడింది.

# "ఖద్దరు హుండీలు విరివిగా కొనండి"

## ముఖ్యమంత్రి అభ్యర్థన

కర్నూలు, అక్టోబరు 2: ఖాదీకి చెల్లించబడే ప్రతిపదహారణాలలో, పదమూడుఅణాలు గ్రామాలలో నివసించే ప్రత్తిపంటదారుకు, ఏకులు తయారుచేసేవారికీ, వడికేవారికీ, నేతపనివారలకూ చేరుతుందనీ, మిగతా మూడణాలు కొనుగోలుదారులకు ధరలో రిబేట్‌ద్వారా చేరుతుందనీ ముఖ్యమంత్రి టి. ప్రకాశంపంతులుగారు ఖద్దరుహుండీలను విరివిగా కొనమని ఆంధ్రులకు ఒక సందేశంలో వివరించారు.

ఖద్దరు హుండీల అమ్మక ఉద్యమాన్ని జయప్రదం చేయాలని రాష్ట్రపతి, ఇండియాప్రధాని చేసిన విజ్ఞప్తిలోపాటు తాము ఈ విజ్ఞప్తిని చేశారు.

ఖాదీ లాభంలేని పద్ధతిని నడిచే పరిశ్రమయనీ, గతంలో రాజకీయ స్వాతంత్ర్య చిహ్నంగా ఉండేదనీ, భవిష్యత్‌లో ఆర్థిక సమానత్వానికి ఖాదీ రక్షగా పనిచెయ్యగలదనీ అన్నారు. ఉత్పత్తికేంద్రాలలో ఖాదీనిల్వలు పెద్దపెట్టున పేరుకున్నాయనీ, ఏకుదల స్తంభించిందనీ వివరించారు.

ప్రాచీనమైన ఈపరిశ్రమకు, పెద్దపెట్టున హుండీలు కొనటం ద్వారా కొత్తగా చేయూతనివ్వటం జరుగుతుందనీ, అందువల్ల వివిధరకాల విలువల హుండీలను విరివిగా కొని, ఈఉద్యమానికి సహాయపడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

# స్వాగతాలకుపరిమిత వ్యయం

## ప్రభుత్వ నిర్ణయం

కర్నూలు, అక్టోబరు 1: వివ్యాపారసంస్థల మార్కెటింగు సంస్థకూడా గవర్నరుకుగాని, మంత్రులకుగాని స్వాగత సన్మాన పత్రాల సమర్పణకుగాను 100 రూ.లను మించి వ్యయం చేయరాదని నిషేధిస్తూ ఆర్థిక నియమాలు సవరించబడినాయి. జిల్లాసంఘాలయితే 100 రూపాయల వరకు వెచ్చించవచ్చునుగాని అంతకుతక్కువ వ్యాపారిక సంఘాలు ఖర్చుపెట్టదగిన గరిష్ఠప్రమాణం 50 రూపాయలు మాత్రమే.

సవరించబడిన నియమాల ప్రకారం మంత్రుల విందులకోసంగాని బహుమాన పేటికలకోసంకాని వ్యయం చేయటానికి వీలులేదు. ఇటీవల్ల స్వాగత సభలకు కొన్ని సంఘాలు మహాజోరుగ ఖర్చు పెట్టుతుండుటవల్ల ఈ నియమాలు ఇలా సవరించబడినాయి.

# ఆంధ్ర న్యాయవాద సంఘ ఎన్నికలు

## అర్హతలపై హైకోర్టు రిజస్ట్రార్ ప్రకటన

కర్నూలు, అక్టోబరు 1: ఆంధ్రా హైకోర్టులో ప్రాక్టీసు చేసుకొనటానికి శాధ్యత పొందినంతమాత్రంచేత ఆంధ్ర న్యాయవాదసంఘ కార్యవర్గాన్ని ఎన్నుకొనే అర్హతగాని, అభ్యర్థిగాని లిచే అర్హతగాని కలగదని, ఆంధ్ర హైకోర్టు రిజిస్ట్రారు ఒక ప్రకటనచేశారు. 1954 జులై 5 నుంచి మామూలుగా ఆంధ్రరాష్ట్రంలో ఉంటూ ప్రాక్టీసు చేస్తున్న సంయుక్త మద్రాసు హైకోర్టు న్యాయవాదులు మాత్రమే ఇండియన్ బార్ కౌన్సిల్ చట్టంక్రింద న్యాయవాదసంఘం జాబితాలో చేరుతారని ఆయన వివరించారు.

# రాష్ట్రరవాణా వ్యవస్థ ఏర్పాటు

## ఆంధ్రప్రభుత్వ నిర్ణయం

కర్నూలు, అక్టోబరు 1: మోటారు బండ్ల చట్టం కింద ఆంధ్ర ప్రభుత్వం వారు రాష్ట్రానికి ఒక రాష్ట్రరవాణా వలస్థను ఏర్పాటుచేశారు. ఆంధ్రప్రభుత్వ రవాణాశాఖ కమిషనర్‌కు ఈసంస్థకు అధ్యక్షులుగా ఉంటారు. రహదార్ల ఛీఫ్ ఇంజనీయరున్ను, పోలీసు (రైల్వేలు, సి. ఐ. డి.)డిప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరలున్ను ఈసంస్థలో సభ్యులు.

## గాంధీ స్మారక బహుమతి

కర్నూలు, అక్టోబరు 1: రాజమండ్రిలో గాంధీ స్మారక బహుమతి ప్రదాననిధికి ప్రభుత్వం ఒక ఏర్పాటు చేసింది. దీనిప్రకారం రాజమండ్రిలోని ప్రభుత్వ స్త్రీల సెకండరీ, ట్రైనింగు పాఠశాల ప్రస్తుత సూపరింటెండెంటు ఈనిధికి పాలక వ్యవహర్తగా ఉంటారు. ఈనిధిమీద వచ్చే వడ్డీలోంచి ప్రతిసంవత్సరం పదిరూపాయలు మించకుండా ఉండే బహుమతి అపాఠశాలలోని మూడవఫారం చదువుతూ ఆక్రిందటి సంవత్సరాంతం పరీక్షలలో ఎక్కువమొత్తం మార్కులు తెచ్చుకొనివున్న పేద విద్యార్థినికి ఇస్తారు.

వాల్తేరు, సెప్టెంబరు 30: ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ వారు యీ దిగువ విద్యార్థులకు ఎం. ఎస్.సీ. డిగ్రీ యివ్వ నిశ్చయించారు.

ఎం. ఎస్‌సి. కెమిస్ట్రీ ప్రథమశ్రేణి: శ్రీయుతులు కె. శ్రీ వెంకటేశ్వర్లు, ఎన్. వి. ఎస్. రామారావు, కె. శ్రీనివాసులు, జి. శ్రీరాములు, ఎం. కాం. (ఆనర్స్):—శ్రీ జె. వి. ఎస్. రామశాస్త్రి.



సమితి కొత్త అధ్యక్షుడు వాన్‌క్లెఫెన్స్ శ్రీమతి విజయలక్ష్మీపండిట్ అభినందించినప్పటి ఫోటో.

ఐక్యరాజ్య సమితిలో భారతదేశ శాశ్వతప్రతినిధి శ్రీ రేజ్ యాన్ స్లావియాకు రాయబారిగా నియమింపబడిన సందర్భంలో న్యూయార్కులో పి. వి. కృష్ణయ్యగారు విందొసంగినప్పటి దృశ్యం.

తిరుగుబాటుచేసి,నౌకను స్వాధీనపర్చుకున్న పోలిష్ నావికులు సెప్టెంబరు 28 వ తేదీన యార్క్‌షైర్ హార్బర్‌లో దిగినప్పటి దృశ్యం.

# పురపాలకసంఘ సభ్యుల ఎన్నిక

## నియమాల సవరణ

కర్నూలు, అక్టోబరు 1: పురపాలకసంఘ సభ్యులను ఎన్నుకొనే పద్ధతిని గురించిన నియమాలను ప్రభుత్వం వారు ఇప్పుడు సవరించారు. సవరించబడిన వానిప్రకారం, పోలింగుస్టేషను మూసివేసేముందే లోపలికివచ్చే ఓటర్లు మాత్రమే తమఓట్లు వేయటానికి వీలు ఉంటుంది. ఎవరైనా ఒకవ్యక్తి మూసివేయకముందే లోనికి వచ్చాడా లేదా అనే ప్రశ్నవస్తే తుది నిర్ణయాధికారం పోలింగు అధికారిదే.



ఇటలీ కొత్త విదేశాంగమంత్రి సిగ్నార్ గాటనో మార్టినో.

# బస్సు ఛార్జీలు

## మోటారు వాహనాల చట్ట నిబంధనలు మార్పు సూచన

కర్నూలు, అక్టోబరు 1: మోటారు బస్సులలో ఎక్కించుకొనేవారిసంఖ్య చార్జీల విషయానికి సంబంధించిన మదరాసు మోటారు వాహనాలచట్టంలోని నియమాలను సవరించాలని ప్రభుత్వం వారు ఆలోచిస్తున్నారు. ప్రకటించబడిన చిత్తు, సవరణలో 12 ఏళ్లు పైబడితేనే నిండుచార్జి వసూలుచేయాలని, మూడేళ్లపైన 12 ఏళ్లవరకూ సగంఛార్జీ అని, మూడేళ్లలోపు ఛార్జీ చేయకూడదని ఉన్నది. ఈసవరణను గురించి ఈనెల 11 వ తేదీనగాని, అతరువాతగాని పరిశీలిస్తారు.

## మోటార్‌బండ్ల లైసెన్సు

కర్నూలు,అక్టోబరు 1: ప్రాంతీయ రవాణా అధికారిచే మోటారు బళ్ల లైసెన్సులు, రిజస్ట్రేషనుల అధికారిగా నియమించాలని ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. కృష్ణా, కర్నూలు, విశాఖపట్నంజిల్లాలలో పైవిధంగా చేస్తూ, మిగిలినచోట్ల పోలీసు సూపరింటెండెంటునే లైసెన్సు, రిజిస్ట్రేషన్ల అధికారిగా ఉంచాలని చిత్తు ముసాయిదాలో పేర్కొనబడింది. ఈ విషయం ఈ నెల 21 వ గాని అతరువాతగాని పరిశీలిస్తారు. అంతవరలోనా ఎవరైనా అభ్యంతరాలుగాని, సూచనలుగాని పంపితే ప్రభుత్వంవారు స్వీకరిస్తారు.

# ప్రొద్దుటూరులో గ్రంథాలయం

## ప్రారంభోత్సవం

ప్రొద్దుటూరు, అక్టోబరు 1: కడప గ్రంథాలయ శాఖకు ప్రారంభోత్సవం ఈ సాయంకాలం జరుపుతూ, ప్రొద్దుటూరు అడిషనల్ జిల్లామునసబు శ్రీ యం. వెంకట్రావుగారు ప్రజలకు పుస్తక భాండాగారాల అవశ్యకతను గురించి ప్రసంగించారు.

శ్రీ గడియారం శేషశాస్త్రిగారు రాయలసీమలో సరియైన పుస్తక భాండాగారము లేదని, ఎవరెవరికి ఏ గ్రంథములు కావలసివచ్చినా మద్రాస్ కో మరెచ్చటికో వ్రాసి తెప్పించుకోవలసి వస్తున్నదని, ఇట్టిపుస్తక భాండాగారములవలన బుద్ధివికాసములు పెంపొంది, సారస్వత పుష్టివృద్ధి కాగలదన్నారు. ఓవలు ఇట్టిసంస్థలవల్ల లాభం పొందవచ్చునని చెప్పారు. సారస్వతమునకు సంబంధించిన గ్రంథములు ఈ పుస్తక భాండాగారములో అందుబాటులో యుండునట్లు చేయవలయునని అధికారులకు విజ్ఞప్తి చేశారు.

ఈ కేంద్ర పుస్తక భాండాగార శాఖకు మార్చి 1955 నాటికి 5 వేల రూపాయలు మంజూరు చేసినారని, ప్రజలు తమ ఠికానుసలహాలనిచ్చిన సాధ్యమైనంతవరకు పాటిస్తామని శ్రీ యం. యల్. నరసింహంగారు చెప్పారు.

శ్రీ యల్. సుబ్బారావుగారి వందన ములతో సభముగిసింది. (స్వ. వి.)

# బీహారు వరద బాధితులకు సహాయం

## ఆంధ్ర పి. ఎస్. పి. సంయుక్త కార్యదర్శి విజ్ఞప్తి

గుంటూరు, సెప్టెంబరు 30: బీహారు రాష్ట్రంలో వరదలబాధకు గురియై అల్లాడుతున్న లక్షలాది ప్రజలకు ఆంధ్ర ప్రజలు, వుదారంగా విరాళాలిచ్చి తోడ్పడాలని, ఆంధ్ర ప్రజా సోషలిస్టుపార్టీ సంయుక్త కార్యదర్శి శ్రీ బి. రత్నసభాపతిగారు విజ్ఞప్తిచేస్తున్నారు. వారివిజ్ఞప్తిలో యిలాఉన్నది.

భారతదేశంలో వరదల బీభత్సం మామూలైంది. దేశంలో ఏదో ఒక ప్రాంతం ఎప్పుడూ వరదదెబ్బ తింటూనే ఉన్నది. ఆస్తినష్టం ప్రాణనష్టం సంభవిస్తూనే ఉన్నది. లక్షలాది ప్రజలు నిరాశ్రయులై అల్లాడుతుండడం జరుగుతోంది. నెహ్రూ ప్రభుత్వం, ఎప్పుడోముందు వరదల నివారణకు చర్య తీసుకొంటాములని వాగ్దానాలు చేయడం మినహా చేస్తున్న దేమీలేదు. ఇది చాలావిచారకరమైనసంగతి.

ఈయేడు బీహారురాష్ట్రం కనీవినీ ఎరుగనంతగా వరదల బీభత్సానికి గురియైంది. లక్షలాది ప్రజలు కొంపాగోడీ సర్వస్వం పోగొట్టుకొని దీనావస్థలో ఉన్నారు. అనేకమంది డాక్టర్లకు కూడా అంతుపట్టని విచిత్ర రోగాలకు బలియౌతున్నారు. ప్రభుత్వం యిస్తున్న సహాయం చాలీచాలకుండా ఉన్నదని తెలుస్తున్నది. బీహారులో గంగానదికి ఉత్తరాన అంతా వరదలకు గురియైతే, దక్షిణాదిన అంతా అనావృష్టికి గురియైంది. ఫలితం యావత్తు రాష్ట్రం యీతిబాధలకు లోనైపోయింది. డబ్బు, మందులు, బట్టలు. పశుగ్రాసం యేరూపేణా, బీహారు సోదరులకు సహాయం, అందజేయడం మనప్రస్తుత కర్తవ్యం. ఆంధ్రదేశంలో ఉదార స్వభావులైనవారు బీహారు ప్రజలకు విరివిగా విరాళాలివ్వాలని మావిన్నపం. ఆవిరాళాలను శ్రీమాయాప్రసాద్ సిన్హా, బీహారు సెంట్రల్ ఫ్లడ్ రిలీఫ్ కమిటీ 'ఆర్' బ్లాక్ 8/6 పాట్నా చిరునామాకు పంపవచ్చు.

# పాఠశాలల నిర్వహణ

## తణుకు ప్రాథమిక ఉపాధ్యాయసభ సూచన

తణుకు, అక్టోబరు 1: రాష్ట్రంలోని వివిధ పాఠశాలల మేనేజిమెంటును ప్రభుత్వమే నిర్వహించాలనీ, ఉద్యోగవయస్సు అంకె పెంచాలనీ, కుప్పుస్వామి కమిటీ నివేదికపై రాష్ట్ర ఫెడరేషన్ చేసిన సూచనలను ఆమోదించాలనీ తణుకు తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘం తీర్మానించింది. సంఘ అసాధారణ సమావేశం తణుకులో పామర్తివారి శ్రీరామా ప్రాథమిక పాఠశాలలో జరిగింది. ఆలమూరి రాజగోపాలరావుగారు అధ్యక్షత వహించారు. తణుకు పడమటరేంజి డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ సౌకర్ల శ్రీరాములుగారు ప్రారంభించారు. వి. వి. రమణరావుగారు మాట్లాడారు. వంగూరి రామారావుగారు అధ్యక్షులుగా, పా. దేం. నృసింహమూర్తిగారు కార్యదర్శిగా, అల్లూరి సూర్యనారాయణరాజు, గాదిరాజు వెంకట్రామరాజుగారలు కార్యదర్శులుగా కార్యవర్గం ఎన్నుకోబడింది. (స్వ. వి.)

# దక్షిణాంధ్ర మండల మహాసభలు

అనంతపురం, అక్టోబరు 1: హిందీ ప్రజామండలి కార్య నిర్వాహకవర్గం సెప్టెంబరు 20 వ తేదీ సాయంత్రం జిల్లా సహకారబ్యాంకు హాలులో పెద్ద గొంది కొండప్పగారి అధ్యక్షతనసమావేశమై దక్షిణాంధ్ర మండల ప్రథమ హిందీ మహాసభ, హిందీ పండిత సమ్మేళనములను అక్టోబరు 16, 17 తేదీలలో జరుపుటకు నిశ్చయించారు. ఈ దిగువ వారితో ఆహ్వానసంఘము యేర్పాటు చేశారు.

శ్రీయుతులు, జె. వి. సి. రాఘవాచార్యులు (అధ్యక్షులు,) మేడా సుబ్బయ్య,గొందికొండప్ప, పరుచూరి హనుమంతయ్యగుప్త, పప్పూరి రామాచార్యులుగారలు. (స్వ. వి.)

# విద్యుచ్ఛక్తిశాఖ పని వారల జీతాలు

విజయవాడ, అక్టోబరు 1: రాష్ట్ర సిబ్బందికి మినహా, విద్యుచ్ఛక్తి శాఖలోని అందరు ప్రభుత్వ పనివారలకు గత నెల 30 వ తేదీన జీతాలు ఇవ్వబడలేదనీ, ఈ చెల్లింపు సందర్భంలో జారీ చేయబడిన ప్రభుత్వ ఉత్తర్వు, అపరేషన్ సబార్డినేట్ సర్వీసు సిబ్బందికి, వర్క్ ఛార్జ్‌డ్ సిబ్బందికి వర్తించదని చెప్పబడిందనీ, ఈ విచక్షణ చూపటం పట్ల పని వారలు ఆందోళన చెందారనీ, ఇక ముందైనా ఇట్టి విచక్షణ చూపకుండా, ఇందుకు కారకులైన వారిపై అవసరచర్య తీసుకోవాలనీ ఆంధ్రరాష్ట్ర విద్యుచ్ఛక్తి శాఖా ఉద్యోగాల సంఘంవారు ముఖ్య మంత్రికి ఒక లేఖను వ్రాశారు.

దార్లపూడి, అక్టోబరు 1: ఏటికొప్పాక పంచదారమిల్లు కార్మికులు అక్టోబరు 5 వ తేదీనుండి సమ్మె చేయుటకు నిశ్చయించు కొన్నట్లు కార్మిక యూనియన్ కార్యదర్శి శ్రీ బి. కృష్ణమూర్తిగారు తెలుపుచున్నారు.

# ప్రజలు నిర్మించిన రహదారి షెడ్డు

## రాఘవరెడ్డిగారిచే ప్రారంభోత్సవం

తణుకు, అక్టోబరు 1: స్థానికసంస్థల ఇనస్పెక్టర్ అయోధ్యాపురపు రాఘవరెడ్డిగారు ఆచంట కోడేరు (కవు కోడేరు) లో నూతనంగా గ్రామస్థుల శ్రమదానంతో నిర్మించబడిన రహదారి షెడ్డును గతనెల 27 వ తేదీన ప్రారంభోత్సవం చేస్తూ ఈ సంప్రదాయాన్ని జిల్లాలంతటా అలవర్చుకోవాలన్నారు. మార్గంలో ఆచంటదేవస్థానం వారు స్వాగతమిచ్చారు.

అనంతరం పండిత విల్లూరు పంచాయతీని దర్శించారు. ఇందుకూరి.సత్యనారాయణరాజుగారు స్వాగతమిచ్చారు. పంచాయితీవారు వృక్షములు పెంచి, ఆదాయం తీయుచున్నందులకు ప్రశంసించారు. రెడ్డిగారు తర్వాత జన్నూరు గ్రామంకు వెళ్లారు, అధ్యక్షులుభూపతిరాజు లక్ష్మీనరసరాజుగారు స్వాగతమిచ్చారు. పంచాయతీవారొసంగిన సన్మానపత్రానికి జవాబు చెబుతూ, పంచాయతీ కృషిని శ్లాఘించారు. లంకల కోడేరులో లంకలకోడేరు పాలు వలి రోడ్డుకు ప్రారంభోత్సవంచేశారు. ఈ సందర్భంలో మాజీ మదరాసు సర్వీస్‌కమిషన్‌సభ్యులు పి. వి. నర్సింహరాజుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. పంచాయతీ అధ్యక్షులు పెన్మెత్స సీతాపతిరాజుగారు రెడ్డిగారికి స్వాగతమిచ్చారు. విందు జరిగింది. శాసనసభ్యులు మూర్తిరాజు, లక్ష్మీనరసరాజు, ద్వారంపూడి బసివిరెడ్డిగారలుకూడా హాజరైనారు.

కొయ్యేటిపాడుపంచాయతీ చేస్తున్న రోడ్డుపనిని చూచారు. పంచాయతీ అధ్యక్షులు కర్రి రామిరెడ్డిగారుస్వాగతమిచ్చారు. అనంతరం ఆలమూరుపంచాయతీవారు చేసిన గ్రామోద్ధరణ కార్యక్రమాలను తిలకించారు. తరువాత సెసమంత్రమ నూతన పంచాయతీ భవనానికి శంకుస్థాపన చేశారు. పంచాయతీఅధ్యక్షులు కలిదిండి వెంకట్రామరాజుగారు వినతిపత్రాన్ని సమర్పించారు. తరువాత పిప్పర పంచాయతీలో జాతీయ విస్తరణప్రణాళిక విరాళం సహాయములో చేసిన నీటి సరఫరా పనిని ప్రశంసించారు.

వి. రాఘవరెడ్డిగారి పర్యటనలో జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసర్ పర్సనల్ అసిస్టెంటు కె.సుబ్బరాజు, జిల్లాపంచాయతీ ఆఫీసరు కె. నరసింహరాజుగారలు, కొత్తగా ఎన్నికైన పశ్చిమగోదావరిజిల్లా పంచాయతీసంఘ అధ్యక్ష, కార్యదర్శులు వారి వెంట ఉన్నారు. (స్వ. వి.)

# ఆంధ్రలో యువజన శిక్షణ శిబిరాలు

## ప్రారంభోత్సవం వాయిదా

రాజమండ్రి, సెప్టెంబరు 31: అక్టోబరు 8 వ తేదీనుంచి నవంబరు 7 వ తేదీవరకూ ఆలమూరులోనూ, రాజమండ్రి తాలూకా బూరుగుపూడి, అమలాపురంలోను యువజన శిక్షణ శిబిరాలు నిర్వహింపబడునని లోగడ ప్రకటింపబడినది. కాని పై తేదీలలో ఆశిబిరాలు నిర్వహింపబడవు" అని భారత సేవక సమాజ ఆంధ్ర ప్రదేశ కన్వీనరు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు తెలుపుతున్నారు.

"అఖిల భారత సేవక సమాజంవారు వివిధ రాష్ట్రములలోని భారత సేవక సమాజ కార్యకర్తలకు శిక్షణ శిబిరముల నిర్వహణకు తర్ఫీదు నిచ్చుటకుగాను నాగపూరు పట్టణమున నవంబరు 1 తేదీ మొదలు 12 వ తేదీ వరకు శిక్షణ శిబిరాలు యేర్పాటుచేసి ఉన్నారు. వివిధ ప్రదేశ కార్యకర్తలు యీ తర్ఫీదు పొందిన పిమ్మటనే వివిధ రాష్ట్రములలో యీ శిక్షణ శిబిరముల నిర్వహించబడతవి. అవి గాక నవంబరు 12, 13; 14 తేదీలలో నాగపూరులో వివిధ ప్రదేశ భారత సేవక సమాజ కార్యకర్తల సమావేశం జరుగుతుంది. ఈసమావేశంలో ప్రదేశ కార్యకర్తలు పాల్గొనవలసి యుండుటచే నాగపూరు సమావేశానంతరమే ఆంధ్ర దేశములో వివిధ మండలములలో భారత సేవకసమాజ శిక్షణ శిబిరాలు యేర్పాటు చేయబడును. ఇదివరలో పెట్టిన దరఖాస్తుదారు లెవరూ, ఆలమూరు, బూరుగుపూడి, అమలాపురం, రామక్కపలేరు. శిక్షణ శిబిరములు యే తేదీలలో యేర్పాటు చేయనున్నదీ తరువాత తెలుపబడును.

## లలితకళా సమితి ప్రారంభోత్సవం

రాజమండ్రి, సెప్టెంబరు 27: శానుదాసు కో-ఎడుకేషన్ హైస్కూల్ విద్యాలయంలోని లలితకళా సమితి ప్రారంభోత్సవం నేడు ఇక్కడ సామర్లకోట ప్రణాళికా నిర్వాహణాధికారి శ్రీ యం. వాసిరెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. ప్రాధ్యాపకు దామెర్ల వెంకటరావుగారు ప్రారంభోపన్యాసం చేశారు.

విద్యార్థులు మూడు నాటికలు ప్రదర్శించారు. మధ్య మధ్య డా. గరికిపాటి రాజారావుగారు, ఎ. శంకరరావుగారలు అభినయ పూర్వకంగా ఉపన్యాసాలు చేశారు. ఉత్తమ నటులకు బహుమతులు ఇవ్వబడినాయి. శ్రీ యన్. సి. హెచ్. బుచ్చయాచార్యులు వందనసమర్పణ చేశారు.

## సరస్వతీ సామ్రాజ్య మహోత్సవాలు

విజయవాడ, సెప్టెంబరు 30: శ్రీ సరస్వతీ సామ్రాజ్య మహోత్సవాలు అక్టోబరు 5, 6, 7 తేదీలలో స్థానిక దివ్యజ్ఞాన సమాజంలో జరుగుతాయి. 5 వ తేదీన మహాసభ రామమోహన గ్రంథాలయంలో విద్యాశాఖా మంత్రి బలుసు ప్రభాకర పట్టాభిరామారావు గారి అధ్యక్షతన జరుగుతుంది. ప్రముఖ సాహిత్యపరులు, కవులు, రాజకీయవేత్తలు పాల్గొంటారు.

## రాజంపేటలో హరిజన వారోత్సవం

రాజంపేట, సెప్టెంబరు 25: ఆంధ్రరాష్ట్ర హరిజన సేవా సంఘ యాదేశానుసారం, కడపజిల్లా హరిజనప్రచారకులు శ్రీ యెర్రబోయిన సుబ్బన్నగారు, హరిజన వార ప్రారంభోత్సవం యేర్పాటు చేశారు. రాజంపేట కొలిమివీధి ఎయిడెడ్ పాఠశాల ఆవరణలో హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ చంద్రశేఖరయ్యర్ గారి అధ్యక్షతన సమావేశం జరిగింది. శ్రీ యం. పట్టాభిరామయ్యగారు, సభను ప్రారంభించారు. శ్రీ దేవరాజ, శ్రీ పుల్లారెడ్డి గారలు ఉపన్యసించారు. అధ్యక్షులవారు హరిజనవారం ఉద్దేశం జయప్రదంగా జరుగు సూచనలు వివరించారు. శ్రీ యం. పుల్లారెడ్డిగారు హరిజన వారమును ప్రారంభించారు. శ్రీ యెర్రబోయిన సుబ్బన్నగారి అభివందనలతో ఉత్సవం ముగిసింది.

## విజయనగరం -హిందీ శిబిరం

విజయనగరం,సెప్టెంబరు 30.విజయనగరములో హిందీ అధ్యాపకశిబిరము నిన్న ప్రారంభించబడింది.

శ్రీ బాలచంద్ర ఆప్టే, ప్రిన్సిపాల్ గారు (హిందీ ప్రచారక్ విద్యాలయము, విజయవాడ) అధ్వర్యము వహించారు. విజయనగర మహారాజా వారి బ్రాంచి కాలేజీలో స్థానిక హిందీ ప్రేమీమండలివారి యేర్పాటుతో ఇది జరుగుతున్నది. విజయనగర మునిసిపల్ చైర్ మెన్ శ్రీ బి.వి. సంజీవరావుగారు ప్రారంభోత్సవము జరిపారు. హిందీ అధ్యాపకులీ సదవకాశము నుపయోగించుకుంటారని ఆశిస్తున్నా మన్నారు. ప్రేమీమండలి కార్యదర్శి శ్రీ అదుర్తి సూర్యనారాయణమూర్తిగారు అధ్యాపకులకు స్వాగత మిచ్చారు. తులసీరామాయణ పఠనముతో కార్యక్రమంసమాప్తమైనది. శిబిరము అక్టోబరు 4 వరకునడుస్తుంది. (ఒ. వి)

## కమ్యూనిస్టుపార్టీనుంచి రాజీనామా

కొండపల్లి, సెప్టెంబరు 30: ఈ గ్రామ పంచాయతీ బోర్డు (కృష్ణాజిల్లా) అధ్యక్ష పదవికి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా ఎన్నికైన శ్రీమధ్యాహ్నపు సుబ్బారావు గారు గ్రామ కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వమునకు రాజీనామా యిచ్చారు. కమ్యూనిస్టు పార్టీ పేరుతో ముఠా నాయకత్వమును లేవదీసి ప్రజాసేవకు భంగకరంగా గ్రామ కమ్యూనిస్టు పార్టీ వ్యవహరిస్తున్నదని పార్టీలో ఉండి ప్రజా సేవ చేయుట దుష్కరమని భావించి సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నానని, అయితే ఎప్పటివలె ప్రజలకు యథాశక్తి సేవచేస్తునే ఉండగలనని, సుబ్బారావు గారు తమ ప్రకటనలో తెలియజేశారు.

## నిడదవోలు కమ్యూనిస్టు రాజీనామా

నిడదవోలు, సెప్టెంబరు 28: స్థానిక కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు, శ్రీ శ్రీధరాల వంగాలు గారు తమపార్టీ సభ్యత్వమునకు రాజీనామా చేశారు. వీరుపంచాయతీ బోర్డులో సభ్యులు.





## చంగల్పట్టుజిల్లా బోర్డు ఎన్నికలు

### పొన్నేరితాలూకాలో ముగ్గురు తెలుగు అభ్యర్థుల గెలుపు

పొన్నేరి, అక్టోబరు 2. చంగల్పట్టుజిల్లా బోర్డుకు పొన్నేరితాలూకాలో మొన్న సెప్టెంబరు 25 న జరిగిన ఎన్నికల ఫలితాలు నేడు ప్రకటింపబడినవి. మొత్తం 7 స్థానాలకు కాంగ్రెస్ అభ్యర్థులే గెలిచారు.

వివాదగ్రస్త ప్రాంతమైన సత్యవేడు ఫిర్కాలో సాధారణ స్థానానికి కాంగ్రెసు అభ్యర్థిగా పి. దామోదరంశెట్టి గారు (తెలుగు) పోటీచేసి గెలిచారు. వీరికి 9225 వోట్లు వచ్చినవి. స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసిన ముత్తుస్వామి మొదలి (తమిళ సభ్యుడు) గారు 3675 వోట్లు మాత్రమే వచ్చి ఓడిపోయినారు. ఇదే ఫిర్కాలో రిజర్వుడు స్థానానికి తమిళ కాంగ్రెస్ అభ్యర్థి నాదముని గారు గెలిచారు. ప్రత్యర్థి ఆరుముగం (స్వతంత్ర) ఓడిపోయినారు.

మంజూరు ఫిర్కా సాధారణ స్థానానికి నాగభూషణం నాయుడు గారు (కాంగ్రెస్-తెలుగు అభ్యర్థి) 3497 వోట్లు వచ్చి గెలిచారు. తమిళకమ్యూనిస్టు ప్రత్యర్థి మాణిక్యం గారు 2756 వోట్లు మాత్రమే వచ్చి ఓడారు. చోళవరం ఫిర్కాలో తెలుగు అభ్యర్థి ఆర్. గోవిందరాజుల నాయుడు గారు (కాంగ్రెసు) పోటీలేకుండా గెలిచారు. మెదూరుఫిర్కాలో తమిళ కాంగ్రెసు అభ్యర్థి జయరాం మొదలిగారు గెలిచారు.

మొత్తం 7 స్థానాలలో 3 స్థానాలకు తెలుగు అభ్యర్థులు గెలిచారు. సెప్టెంబరు 30 న ఓట్ల లెక్కింపు జరిగింది. (ఒ. వి.)

## బుడమేటి వరదలవల్ల నష్టం

### 50 వేల ఎకరాల ముంపు

గుడివాడ, అక్టోబరు 1: బుడమేటి రైతుసంఘం తరఫున, ఆ సంఘకార్యదర్శి శ్రీ యర్రపల్లి వెంకట్రావు, శ్రీ వీరపనేని రామదాసు, శ్రీ బి. వి. రావు, శ్రీ ఎ. సుబ్రహ్మణ్యం గారలు, పోయిన నెల 26,27 తేదులలో అధిక వర్షాలవల్ల బుడమేరు పొంగి నష్టపరచిన ప్రాంతాలలో పర్యటించివచ్చి, విజయవాడ, గన్నవరం గుడివాడ తాలూకాలలోసుమారు 50 వేల ఎకరాలమెట్ట మాగాణిపైర్లు నీటమునిగాయని సముద్రంలా ఎటుజూచినా కనుచూపు మేర నీరు కన్పిస్తున్నదని తెలియజేస్తున్నారు. వారింకా యీ దిగువ విషయాలు తమ ప్రకటనలో పేర్కొన్నారు: ముఖ్యంగా కొయ్యగూర్పాడు, ఓంద్రపాడు, పుట్టగుంట, చేదుర్తిపాడు క్రం౦డిక, మోపర్రు, వద్దలమెరక పాలపురం ముక్కపాడుపల్లె వగైరా గ్రామాలు నీటమునిగాయి. వ్యవసాయకూలీలు చాలాచోట్ల ఇళ్లువదలి వెళ్లిపోయారని, రైతులకు పెద్దనష్టమే గాక పశుగ్రాసం కూడ కుళ్లిపోయింది. గుడివాడ నూజివీడు రోడ్డుపై పుట్టగుంటవరకు యిరు వైపులా 3 మైళ్లు పొలలోతునీరు ప్రవహిస్తుంది. కేసరపల్లివద్ద బెజవాడ ఏలూరురోడ్డుపై 3 ఫర్లాంగులు నీరు వస్తోంది. అదేవిధంగా మేడూరుగన్నవరం తెల్రపోలు ఉయ్యూరు రోడ్డుపై నిలువులోతు నీరు ప్రవహిస్తోంది. ఈ నాలుగు రోడ్లపైనా రాకపోకలు బంద్ అయినవి. 1949 తర్వాత యిజే పెద్దవరద. 5 సం॥ రాల వ్యవధి వచ్చేసరికి బుడమేటి ప్రమాదం ప్రభుత్వ దృష్టిలో లేకుండా పోయింది. అనేక సం॥ రాలుగా ఆందోళనచేస్తున్నప్పటికి బుడమేటి స్కీమును ప్రభుత్వం అమలుజరుపకుండా ఉంపడం శోచనీయంకాదు. ఇప్పటికైనా ఆంధ్ర మంత్రివర్గం వాస్తవ పరిస్థితులు గమనించి రైతులు వాళ్లోవంతు భరించడానికి సిద్ధంగా ఉన్న కవులూరు డైవర్షన్ స్కీమును అమలు పర్చాలి.

తక్షణం ప్రభుత్వోద్యోగులు వరద ప్రాంతాలకువెళ్లి వివరాలు సేకరించి వరదప్రాంతాలకు పూర్తి రెమిషన్ యివ్వాలి. రైతుల ఎరువుబాకీలను రద్దుచేయాలి. బీదరైతులకు వడ్డీలేకుండా అప్పులివ్వాలి.

## ధర్మాదాయ దుర్వినియోగ నివారణోద్యోగి పర్యటన

ముచిలీపట్నం, అక్టోబరు 1: హిందూ దేవాదాయ ధర్మాదాయ దుర్వినియోగ నివారణకు ప్రత్యేకోద్యోగిగా నియమింపబడిన శ్రీ టి. నీలాద్రి నాయుడుగారు యీ దిగువ కార్యక్రమం ప్రకారం ఆంధ్రదేశంలో ఆయా చోట్ల ప్రజలు మతిసంస్థల ద్రవ్యం ఎలా వినియోగిమవుతున్నది వారికి నివేదించవచ్చు.

కార్యక్రమం అక్టోబరు 5 శ్రీకాకుళం 6 శ్రీకాకుళంలో ముకాం, 7 ఇచ్ఛాపురం సోంపేట, పలాస, 8 టెక్కలి నరసన్నపేట, పాలకొండ, పేరుమట్టం, పార్వతీపురం, 10 బొబ్బిలి సాలూరు, 11 విజయనగరం, 12 విజయనగరంనుండి బందరుకు ప్రయాణం, 15 నంద్యాల, 16 నంద్యాలలో ముకాం, 17 ద్రోణాచలం, 18 కర్నూలుకు ప్రయాణం, 19 కర్నూలులో ముకాం 20 కోవెలకుంట్ల, 21 నందికొట్కూరు, 22 బందరుకు ప్రయాణం.

## ప్రత్యేక ఒంగోలు జిల్లా ఏర్పాటు

### కృషికలోక్‌పార్టీ అభ్యర్థన

ఒంగోలు, సెప్టెంబరు 30: ఒంగోలు కేంద్రంగా ఒంగోలు, నర్సారావుపేట, వినుకొండ, మార్కాపురం, కనిగిరి, కందుకూరు, దర్శి, పొదిలి తాలూకాలతో వెంటనే ఒంగోలు జిల్లాను ఏర్పాటు చెయ్యాలనీ, ఒంగోలు తాలూకా ఉత్తర భాగాన్ని అద్దంకి తాలూకాగా నిర్మించాలనీ ఒంగోలు తాలూకా కృషికలోక్ పార్టీ కార్యవర్గం ప్రభుత్వాన్ని అభ్యర్థించింది.

ఒంగోలు తాలూకా కృషికలోక్ కార్యవర్గ సమావేశం 28 వ తేదీన చీమకుర్తి గ్రామంలో గొల్లపూడి వెంకట సుబయ్యగారి అధ్యక్షతన జరిగింది. నాగినేని వెంకయ్య, చెంచు రామయ్య, మన్నె సీతారామయ్య, గొల్లపూడి వీరాస్వామి గారలు మాట్లాడారు.

రాబోయే అసెంబ్లీ సమావేశంలో సమగ్రమైన ఈనాం బిల్లును ప్రవేశపెట్టాలనీ, రాష్ట్ర ప్రభుత్వం నందికొండకే ప్రాధాన్యత నివ్వాలనీ, ఒంగోలులో పశువుల అభివృద్ధికి ఫారం ఏర్పాటు చెయ్యాలనీ, మేదరమెట్లలో పశువుల ఆసుపత్రిని వెంటనే తెరవాలనీ, అద్దంకిలో ఒక వ్యవసాయ డిమానుస్ట్రేటర్ ఆఫీసును పెట్టాలనీ ఏకగ్రీవంగా తీర్మానించారు. స్వ. వి.

## సబ్ ఇన్‌స్పెక్టరు ఇంట్లో చోరీ

### పిస్తోలు, కత్తి అపహరణ

ఒంగోలు, సెప్టెంబరు 28: గతరాత్రి రైల్వే పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఆర్. రామచంద్ర సింగు ఇంట్లో చోరీ జరిగింది. గుళ్లు నిండా ఉన్న ఒక పిస్తోలు, ఒక పెద్ద కత్తి, యూనిఫారం, చీరలు మొదలయినవి ఎత్తుకుపోయినారు. బదిలీ ఉత్తరువు మీద ఆయన వెళ్లినప్పుడు ఇంటితాళం పగులగొట్టి లోనికి ప్రవేశించారు. ఒంగోలు పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు శ్రీ పి. శివదానంగారు దర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

## యువతి ఆత్మహత్య

ఒంగోలు, సెప్టెంబరు 29: ఇక్కడికి 7 మైళ్ళ దూరంలో ఉన్న పెదకొత్తపల్లిలో గత సోమవారంనాడు బాతుల అంజమ్మ అనే 20 ఏళ్ళ ఆమె ఉరి తీసుకొని మరణించింది. కడుపు నొప్పి బాధ భరించలేక అలాచేసినట్లు తెలిసింది. తాలూకా పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు. శవాన్ని పోస్టుమార్టం కోసం ఒంగోలు ప్రభుత్వ ఆసుపత్రికి పంపారు. (స్వ. వి.)

## ఒంగోలులో టెలిఫోన్ ఎక్స్చేంజి

ఒంగోలు, సెప్టెంబరు 30: తంతితపాలా శాఖవారు టెలిఫోన్ ఎక్స్చేంజి సంబంధాలకుగాను దరఖాస్తులు స్వీకరిస్తున్నారు. కనీసం ఒకదరఖాస్తు అన్నా ఉంటే ఎక్స్చేంజి పెడారు. ఇప్పుడు ఒంగోలులో 20 దరఖాస్తులు వచ్చినాయి. త్వరలోనే తక్కినవి కూడా వచ్చి ఎక్స్చేంజి ప్రారంభిస్తారని అనుకుంటున్నారు. (స్వ. వి.)

ఒంగోలు, సెప్టెంబరు 30: పురపాలక సంఘం కమిషనరు శ్రీ యన్. వి. జగ్గారావు నాయుడుగారు బదిలీ అయి వెళ్తున్న సందర్భంలో స్థానిక రెడ్‌క్రాసు సంఘంవారు తేనీటి విందు చేశారు. సబ్ కలెక్టరు సి. సుందరేశన్ అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ డి. వెంకటేశ్వర్లు ప్రసంగించారు.

## పశ్చిమగోదావరి జిల్లా బోర్డుపై దావా

### భీమవరం మున్సిబు తీర్పు

భీమవరం, అక్టోబరు 1: జిల్లా బోర్డుపైన, జిల్లా బోర్డు కంట్రాక్టరు పయిన శ్రీ నందిగాం సూర్యనారాయణ, మరికొందరు తెచ్చిన రెండు దావాలలో జిల్లా మునసబు శ్రీ సి. రంగనాయకులు గారు తీర్పు చెపుతూ మాండేటరీ ఇంజక్షను, శాశ్వత ఇంజక్షను ఉత్తరువులు జారీ చేసి ప్రతివాదులు, వాదులకు 1500 రూపాయల నష్టపరిహారం చెల్లించాలని చెప్పారు.

1952 లో కొత్తరోడ్డు వేస్తూ కంకంట్రాక్టరు వాదుల పొలాలలో నుంచి మట్టి త్రవ్వారనీ, అందువలన తిరిగి మట్టి తోలించేటందుకు సూచేటుగా ఆతవ్వించిన మేరలో పంట నష్టమైందనీ దానికి నష్టపరిహారం చెల్లించాలని వాదులు కోరారు. కోర్టువారు మట్టి త్రవ్విన గుంటలు పూడ్చాలని ఆదేశిస్తూ మాండేటరీ ఇంజక్షను, మళ్లీ వానిలో జోక్యం కలుగజేసుకోకుండా శాశ్వత ఇంజక్షను జారీ చేయాలనీ కూడా కోరారు.

శ్రీ యన్. గున్నేశ్వరరావు వాదితరఫున, జిల్లా బోర్డు తరఫున శ్రీ జి. వెంకయ్య నాయుడు, కంట్రాక్టరు తరఫున శ్రీ జె. అచ్యుతరామయ్య వాదించారు.

## కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, అక్టోబరు 2: ఇక్కడ ఈ ఉదయం కృష్ణానదిలో నీరు ఆనకట్టకు 8.9 అడుగులపైగా ఉన్నది.

## హిందూపురానికి రెవిన్యూమంత్రి రాక

### ఎగువ పెన్నారు ప్రాజెక్టు తనిఖీ

హిందూపురం, అక్టోబరు 3: రెవిన్యూ మంత్రి శ్రీ కోటిరెడ్డిగారు కర్నూలునుంచి కారులో ఇదటకు యీ మధ్యాహ్నం వచ్చారు. జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కల్లూరి సుబ్బారావు, దొంతిభీమయ్య, కె. ఆర్ సత్యం, సూర్యనారాయణ గార్లు ప్రభృతులు స్వాగతమిచ్చారు. ఆర్. డి. వో. శ్రీ యం. సత్యనారాయణగారు మంత్రిగారి వెంట వచ్చారు.

తాలూకా ప్రజాసోషలిస్టు కార్యదర్శి ఒక వినతిపత్రం సమర్పిస్తూ హిందూపురం తాలూకాను క్షామ ప్రాంతంగా ప్రకటించాలనీ, శిస్తుతీరువ తగ్గించాలనీ, సెనాలీలు రద్దు చేయాలనీ కోరారు. శ్రీ దొంతిభీమయ్య గారొక విజ్ఞప్తిపత్రం సమర్పిస్తూ, హిందూపురంలో పంచదార ఫ్యాక్టరీ స్థాపించాలని కోరారు.

మంత్రిగారు తగు శ్రద్ధ చూపగలమని వాగ్దానం చేశారు. హిందూపురం వస్తూ దారిలో మంత్రిగారు ఎగువ పెన్నార్ ప్రాజెక్టు తనిఖీ చేశారు. గ్రామీణులసాధక బాధకాలు విన్నారు. పిదప బెంగుళూరు వెళ్ళారు.

## బెంగుళూరు-తిరుపతి బస్సు సర్వీసు

### రాష్ట్రరోడ్డు రవాణాబోర్డు నిర్ణయం

తిరుపతి, అక్టోబరు 1: బెంగుళూరు-తిరుపతుల మధ్య పలమనేరుమీదుగా "ఎక్స్‌ప్రెస్ బస్సు సర్వీసు"ను నడపటానికి, బస్సు రేటును రు. 6-8-0 గా నిర్ణయించటానికీ రాష్ట్ర రోడ్డు రవాణా (ట్రాఫిక్) బోర్డు తాత్కాలికంగా అంగీకరించింది. ఇందుకు సంబంధించిన అధికారులనుంచి అనుమతి వచ్చిన పిమ్మట, ఈ నెల 15 నుంచి, లేదా దాదాపు ఆప్రాంతంలో సర్వీసు ప్రారంభం కావాలని ప్రతిపాదన జరిగింది.

ఆంధ్రరాష్ట్రరోడ్ల రవాణా (ట్రాఫిక్) బోర్డు సమావేశం మద్రాసులో మైసూరురాష్ట్ర ట్రాన్సుపోర్టు కమిషనర్ ఎన్. ఎ. అయ్యర్ అధ్యక్షతన జరిగింది. ఆంధ్ర, మైసూరు ప్రభుత్వాల ప్రతినిధులు హాజరైనారు. తిరుమల తిరుపతి దేవస్థానం తరఫున ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు సి. అన్నారావుగారు కూడా పాల్గొన్నారు. ఈ సమావేశం బెంగుళూరు ప్రాంతాలనుంచి వచ్చే యాత్రికుల సౌకర్యార్థం బెంగుళూరు-తిరుపతుల మధ్య బస్సులను నడపటాన్ని గురించిపరిశీలించటానికి జరిగింది.

## ప్రొద్దుటూరులో నేతి పరిశ్రమ కేంద్రం

### రాష్ట్ర మార్కెటింగు అధికారి పరిశీలన

ప్రొద్దుటూరు, అక్టోబరు 1: ఆంధ్రరాష్ట్ర మార్కెటింగ్ అధికారి శ్రీ సి. అన్నామలైగారు ఇచ్చట నేతిపరిశ్రమ కేంద్ర స్థాపన అవకాశాలను పరిశీలించేనిమిత్తం నిన్న టి దినం ఇచ్చటికి వచ్చారు. ఈ పూరు నుంచి ప్రతిసంవత్సరం 40 వేల డబ్బాల నెయ్యి ఎగుమతి అవుతుంది. వీరితో కూడ రాష్ట్రఅసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరు శ్రీ టి. కృష్ణారెడ్డిగారు, జిల్లా వ్యవసాయశాఖాధికారి శ్రీ ఎం. రామిరెడ్డిగారు వచ్చారు. స్వ. వి.

## నండూరు గ్రామానికి పంచాయతీబోర్డు

గుంటూరు, సెప్టెంబరు 29: స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులు శ్రీ పిడ్డి రెడ్డి తిమ్మారెడ్డిగారు మొన్న యిక్కడికివచ్చిన సందర్భంలో గుంటూరు జిల్లా ప్రజాసోషలిస్టుపార్టీ సంయుక్త కార్యదర్శి శ్రీ టి ఎస్. రామమూర్తి గారు నండూరు గ్రామస్థుల తరఫున విజ్ఞాపన సమర్పిస్తూ, ఆ గ్రామంలో పంచాయతీ బోర్డు స్థాపించాలని కోరారు.

## అనీబీసెంట్ దేశసేవ

### మదనపల్లి పౌరుల జోహారులు

మదనపల్లి, అక్టోబరు 1: భారతసంరక్షణోద్యమములో ప్రఖ్యాతి గాంచిన డా॥ అనిబెసెంటు 107 జన్మదినోత్సవములు, ఈ వేళ యిక్కడ వైభవంగా జరిగాయి. ఈ సందర్భమున జరిగిన మహాసభకు మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ్ అధ్యక్షతవహిస్తూ సంఘసంస్కర్తగాను, రచయితగాను, వక్తగాను భారత స్వాతంత్ర్యోద్యమానికి ఆమె చేసిన సేవను ఉగ్గడించారు.

## లండన్ - బొంబాయి విమాన సర్వీసు

కలకత్తా, అక్టోబరు 1: ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ వారి లండన్-బొంబాయి విమాన సర్వీసు వారానికి నాల్గుసార్లనుండి 5 సార్లకు హెచ్చింపబడుతుందని సివిల్ వైమానికశాఖ డైరెక్టర్ జనరలు శ్రీ ఎం. సి. జెయిను ప్రకటించారు. విమానాలు వారానికి 5 సార్లు నడవడం ఆదివారాల్లో ప్రారంభమవుతుందని ఆయన పత్రికా ప్రతినిధులకు తెలిపారు.

# ప్రతి పల్లెలో, ప్రతి పట్టణంలో ఆంధ్ర రాష్ట్రావతరణ ప్రథమ వార్షికోత్సవం

ఆంధ్రరాష్ట్ర అవతరణ ప్రథమ వార్షికోత్సవాన్ని అక్టోబరు 1 వ తేదీన రాష్ట్రవ్యాప్తంగా రాజమండ్రి, ఏలూరు, కాకినాడ, బందరు, అనంతపురం వంటి పట్టణాలలో, గ్రామాలలో ఆంధ్రప్రజానీకం ఎనలేని ఉత్సాహంతో, భక్తిశ్రద్ధలతో జరుపుకుంది. ఎల్లప్రాంతాలలో రాష్ట్రాభివృద్ధికి ప్రజానీకం ఇతోధికంగా కృషిచేయుటానికి దీక్షవహించటం జరిగింది.

రాజమండ్రి, అక్టోబరు 1: ఆంధ్ర రాష్ట్ర అవతరణ ప్రథమవార్షికోత్సవం యీరోజున, రాజమహేంద్రవర నగరంలో మహావైభవంగా జరుపబడింది. పట్టణ కాంగ్రెసు-యువజన కాంగ్రెసు సంఘాల వారిచే, సుబ్రహ్మణ్య మైదానమున జాతీయ పతాకారోహణోత్సవం ఏర్పాటు చేయబడింది. జిల్లాజడ్జీ శ్రీ దరిశింగయ్యచెట్టిగారు పతాకాన్ని ఎగురవేశారు. తర్వాత శ్రీ విక్రమహాలులో శ్రీ దరిశింగయ్యచెట్టిగారి అధ్యక్షతను సభ జరిగింది. శ్రీ మైలవరపు వెంకటశాస్త్రి, శ్రీ దామెర్ల వెంకటరావు, శ్రీ ముట్నూరి సోమసుందరం ప్రభృతులు ఆంధ్రరాష్ట్ర పురోగమనానికి దీక్షతో, సంఘటితంగా, నిర్మాణయుక్తంగా కష్టించి పని చేయవలసిన ఆగత్యాన్ని గురించి ప్రసంగించారు.

ప్రభుత్వ ఆంధ్రా పేపరుమిల్లులో జనరలు మేనేజరు శ్రీ జమ్మి కృష్ణమూర్తి పతాకోత్సవాన్ని జరిపారు. చిరంజీవి మంచిరాజా సుందరమూర్తి 'తెలుగుతల్లి' రాష్ట్రగీతాన్ని పాడారు. మిల్లు కార్మికసంఘ కార్యాలయంలో అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాముల చిత్రపటమును కార్మిక సంఘాధ్యక్షులు శ్రీ మంచిరాజు చంద్రశేఖరం ఆవిష్కరించారు. మిల్లుకార్మికుడు శ్రీ వి త్తనాల కృష్ణరావురచించిన 'పొట్టి శ్రీరాములకు జోహారు' అనే కీర్తనను చదివారు. శ్రీ బాలంత్రపు శివరావు భాగవతుల హరికథా కాలక్షేపములు ఏర్పాటు చేస్తున్నారు. ప్రభుత్వ ట్రెయినింగు కళాశాలలో ఉపాధ్యాయులు ఆచార్య శ్రీ రాజమన్నార్ గారిచే జాతీయ పతాకారోహణ జరుపబడింది. కళాశాల జాతీయ స్వచ్ఛంద దళ విద్యార్థులూ - పతాక వందన మూ జరుపబడింది.

పురపాలక సంఘ కార్యాలయంలో ఛైర్మన్ డాక్టర్ ఎ. బి. నాగేశ్వర రావుగారు జాతీయపతాకాన్ని ఎగురవేశారు. ఉద్యోగులూ, కౌన్సిలర్లూ, పురపెద్దలూ యిందు పాల్గొన్నారు. పాఠశాలల బాల బాలికలకు మిఠాయి పంచిపెట బడింది.

శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘము వారు ఉపాధ్యక్షులు శ్రీ కొత్త వీరరాజుగారి నాయకత్వాన ఉదయము నగర సంకీర్తన చేశారు. సమిష్టి ప్రార్థన గీతా పారాయణ చేశారు. మరొక ఉపాధ్యక్షులు శ్రీ కంభర్ల గంగాధరం గారిచే జాతీయపతాకారోహణ జరుపబడింది. రాజమండ్రి విద్యుచ్ఛక్తి సరఫరా కంపెనీలో జాతీయపతాకారోహణోత్సవం వైభవంగా జరుపబడింది. సంఘ అధ్యక్షులు శ్రీ అప్పన రంగారావు ఉపాధ్యక్షులు శ్రీ దేవతి రామమోహన రావు, డైరక్టర్లు శ్రీ తడవర్తి వెంకటస్వామి, శ్రీ మామిడి అప్పారావు, శ్రీ కొల్లి అప్పలస్వామి మొదలగువారూ ఉద్యోగులూ సిబ్బందీ పాల్గొన్నారు. కార్మికులకూ, యితరులకూ ఈ పండుగ వేడుకగా మిఠాయి ఫలహారములూ యివ్వబడినవి.

రాజమండ్రి పట్టణ వాణిజ్యమండలి కార్యాలయంలో సంఘాధ్యక్షులు శ్రీ దేవతి రామమోహనరావు గారిచేజాతీయ పతాకోత్సవం జరుపబడింది. నగరంలోని ప్రముఖ వర్తకు లందరూ ఇందు పాల్గొన్నారు. మిఠాయి పంచిపెట్టటం జరిగింది. శ్రీ రామనగర్ గ్రంథాలయంలో ఉత్సవం జరిపారు.

వినాయక బాలసంఘంవారు దానవాయపేట పార్కులో ఉత్సవం జరిపారు. దంతొల రామయ్య నాయుడు గారు జెండా ప్రతిష్ఠాపన చేసారు. దామెర్ల వెంకట్రావు, శ్రీ వ్వీడి లింగరాజు, రావూరి సుబ్బమ్మ, అద్దేపల్లి వివేకానందదేవి, భావరాజు అయోధ్య రామారావు గారలు మాట్లాడారు. రాత్రి కుమారి అల్లు సత్యవతి దేవి ఫిడేలు కార్యక్రమం జరిగింది. సభకు దామెర్ల వెంకట్రావుగారు అధ్యక్షత వహించారు.

ప్రభుత్వమువారి బాలికల ఉన్నత పాఠశాలలో సూపరింటెండెంటు శ్రీమతి జె. కె. సరస్వతిగారి యాజమాన్యమున కొద్ది రోజులనుంచి జరుపబడుచున్న వైజ్ఞానిక విద్యా విషయక ప్రదర్శనలు నిన్న టతో సమాప్తం చేయబడినవి. ఆంధ్రరాష్ట్ర వార్షికోత్సవ సభ సమయంలో డివిజనల్ యిన్‌స్పెక్టరెస్ శ్రీమతి అరిగెల కోటమ్మగారి అధ్యక్షతన సభను జరిపి యీ ప్రదర్శనల వేడుకను ముగించారు.

### కాకినాడ

కాకినాడ, అక్టోబరు 2: కాకినాడ రేచర్ల పేటలో శ్రీ ధనరాసి గంగారావుగారి ఆధ్వర్యాన రాష్ట్ర దినోత్సవం అతి వైభవంగా జరిగింది. ఉదయం 8 గం. విద్యార్థిసంఘం వారిచే జెండా ప్రతిష్ఠాపన జరిగింది. ఆటల పోటీ జరిగింది. సాయంత్రం శ్రీకోదండ రామాలయమువద్ద శ్రీ పుల్లిపాపారావుగారి అధ్యక్షతన సభ, పాటల పోటీ జరిగింది. మామిడి అచ్యుత రామయ్య, చింతలపూడి అచ్చన్న, పూర్వాన బసవులు భీ. వా భూపణరావు. ధనరాసి వెంకట్రావుగారలు మాట్లాడారు.

### ఏలూరు

ఏలూరు, అక్టోబరు 2: ఆంధ్రరాష్ట్ర అవతరణ ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో నిన్న ఉదయం జిల్లాపోలీసు మైదానంలో రిజర్వుపోలీసు వారిచే సైనికవిన్యాసం జరుపబడింది. జిల్లా కలెక్టర్ శ్రీ జి. సింహాద్రిగారు వందనం స్వీకరించారు. అనంతరం శ్రీ రాజనాల గోపాలరావు నాయుడుగారు బాల బాలికలకు మిఠాయిలు పంచిపెట్టారు.

పురపాలకసంఘ కార్యాలయంలో సంఘాధ్యక్షులు శ్రీ దామరాజు వెంకట్రావుగారిచే కార్యాలయ భవనంపైన జాతీయ పతాకావిష్కరణ జరుపబడింది. జిల్లాజడ్జి శ్రీ జె. నాగిరెడ్డిగారు బాలబాలికలకు మిఠాయిలు పంచిపెట్టారు. మధ్యాహ్నం 12 గంటలకు ఏలూరు బియ్యంమిల్లుల సంఘంవారు బీదలకు అన్నదానం చేశారు. సాయంకాలం పురపాలక సంఘభవనంలో జిల్లా కలెక్టరు శ్రీ జి. సింహాద్రిగారు ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశంగారి చిత్రపటం ఆవిష్కరించారు. ఈ చిత్రపటం మునిసిపల్ వైస్ ఛైర్మన్ శ్రీఆర్. గోపాలరావు నాయుడుగారిచే కౌన్సిలు వారికి బహూకరింపబడింది. సమావేశానంతరం అమరజీవి పొట్టి శ్రీరాములు గారి చిత్రపటంతో పుర వీధులగుండా ఊరేగింపు జరిగింది. రాత్రి పురపాలక సంఘ రేడియో ద్వారా బాలుర బుర్రకథదళం సుభాస్ బాబు జీవితాన్ని చెప్పారు. అనంతరం కీలుబొమ్మలాట ప్రదర్శింపబడింది.

సర్ సి. ఆర్. రెడ్డి కళాశాలలో కూడ వార్షికోత్సవం జరుపబడింది. సెంట్ థెరిసా కళాశాలలో శ్రీ మూల్పూరి రంగయ్యగారు పతాకాన్ని ఎగురవేశారు.

పశ్చిమ గోదావరిజిల్లా అసోసియేటెడ్ వాణిజ్యమండలి కార్యాలయంలో జిల్లాకాంగ్రెసు సంయుక్త కార్యదర్శి శ్రీ మాలే వెంకట నారాయణ గారిచే పతాకోత్సవం జరుపబడింది. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టినారు. మధ్యాహ్నం 500 మంది బీదలకు అన్నదానం చేశారు.

ఈ సందర్భంలో ఏలూరు పురపాలక సంఘంవారు 14 పబ్లిక్ పంపులకు ఈదినం ప్రారంభోత్సవంచేశారు.

### ప్రొద్దుటూరు

ప్రొద్దుటూరు, అక్టోబరు 2: మనకు గల గోదావరి, కృష్ణ, తుంగభద్రనదుల నుంచి ప్రజలు సత్ఫలితాలు పొందడానికి తగు కృషి జరగాలి. సారస్వతంలోను, భాషా ప్రావీణ్యంలో, కవిత్వం, పరిపాలనాదక్షతలోను ఆంధ్రులెంతో మందినిపుణులున్నారు.అనినిన్న సాయంకాలం రంగయ్యగారి సత్రంలో వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించిన శ్రీ వి. కొండారెడ్డిగారు ప్రసంగించారు. బేసిక్ ట్రయినింగుస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ రామశర్మ గారు ప్రజలు ఐకమత్యంతో మెలగవలసిన ఆవశ్యకతను వివరించారు. రివరెండు జాన్ గారు మాట్లాడారు.

ప్రాథమిక పాఠశాల విద్యార్థులు నానా ప్రదర్శనలు ప్రదర్శించారు. స్థానిక తాసిల్దారు శ్రీ యం. పి. లూకు గారి వందనములతో సభ ముగిసింది. నిన్న ఉదయం దేవాలయాలు మసీదులు, చర్చిలలోను ప్రత్యేక ప్రార్థనలు జరిగాయి బడిపిల్లలు పురప్రముఖులు కూడ హైస్కూలుకు చేరారు. మునిసిపల్ స్పెషలు ఆఫీసరు శ్రీ పి. సుందరాచార్యులుగారు జాతీయపతాక వందనం చేశారు. అనంతరం విద్యార్థులంతా, అన్ని శాఖల అధికారులు పురవీధులలో మంగళవాద్యాలతో ఊరేగారు. పిల్లలకు పిప్పరమెంటు పంచి పెట్టారు. ఆర్య వైశ్య సంఘం వారు వేలాది బీదలకు అన్నదానం చేసారు.

### కార్వేటినగరం

కార్వేటినగరం, అక్టోబరు 2:— ఆంధ్రరాష్ట్ర ప్రథమ వార్షికోత్సవం కార్వేటినగరంలో వైభవంగా జరుపబడింది. నిన్న ఉదయం పంచాయతీ ఆఫీసువద్ద విద్యార్థులు, పౌరులు పతాకోత్సవం జరిపారు. శాసనసభ్యులు ఆర్. బి. వి. సుదర్శన వర్మగారు పతాక ప్రాధాన్యతను వివరించారు. శ్రీ వేణుగోపాలస్వామి, ఇతర ఆలయాలలో పూజలు జరిగాయి. పంచాయతీ వారు మిఠాయిలు పంచిపెట్టారు. మధ్యాహ్నం డాక్టర్ ఆర్. చంగల్రాజు గారి ఇంటివద్ద అన్నదానం చేశారు, బడిపిల్లల ఆటలపోటీ, బాలికల నాట్యప్రదర్శన జరిగింది. సాయంత్రం పంచాయతీ బోర్డునందు బహిరంగసభ వెంకట్రామయ్యగారి అధ్యక్షతన జరిగింది. పంచాయతీ అధ్యక్షులు కె. సి. సత్యనారాయణయ్యగారు ప్రభుత్వానికి ప్రతిఒక్కరు తోడ్పడాలన్నారు. మైనరు ఎస్టేట్ మేనేజరువారు బహుమతులు పంచిపెట్టారు.

### నగరంలో రాష్ట్ర వార్షికోత్సవ సభ

మదరాసు, అక్టోబరు 2. ఆంధ్ర రాష్ట్ర ప్రథమ వార్షికోత్సవం నిన్న ఈరా శ్రీరాములు శ్రేష్ఠిగారి సత్రమునందు జరిగినది. వితగుత్సవమునకు శ్రీ నిడదవోలు వెంకటరావు గారు అధ్యక్షత వహించారు. నాటి సాయంకాలము అధ్యక్షుడుగా శ్రీ డి. సత్యనారాయణగారు నియమింపబడిరి. ప్రార్థన సౌ॥ జానకిచే జరుపబడినది. అనంతరం శ్రీ వెంకటరావుగారు శ్రీరాములు చిత్రపటావిష్కరణ జరిపిరి. అధ్యక్షులు సమితి కార్యక్రమమును, ఆంధ్రుల కార్యదీక్షనుగూర్చి మెచ్చుకొంచిన పిమ్మట, కోట సోదరులలో, పిన్నలు శ్రీ సత్యరంగయ్యశాస్త్రి గారు "త్యాగమూర్తి" కావ్యమునుండ 'అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములపై కావ్యగానము చేశారు. పిమ్మట, శ్రీ జలగం సుబ్రహ్మణ్యం నాయుడు గారు, ఆంధ్ర యువకుల ఉత్సాహమును ప్రశంసించినారు. తరువాత శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, అధ్యక్షులను, అమరజీవిని ఆంధ్రరాష్ట్రావతరణమునుగూర్చి ఆశువుగ పద్యములు చెప్పిరి. పిమ్మట అధ్యక్షుల అంతోపన్యాసమున, ఆంధ్రుల పూర్వచరిత్రనుగూర్చి ఆంధ్ర భాషనుగూర్చి ఆంధ్ర యువకులను గూర్చి ప్రసంగించిరి.

అనంతరము, "పిచ్చివాడు"—గా నటించిన చి. డి. సత్యనారాయణకు వెండిపతకము, "అడవి"—శ్రీ పినిశెట్టి వారి నాటికను ప్రదర్శించిన వారిలో, ప్రముఖపాత్ర వహించిన, చి॥ కృష్ణస్వామికి, వెండికప్పును, గానప్రదర్శనము గావించిన, వీరరాఘవరావు గారికి వెండిపతకమును, సమితి సభ్యులు బహూకరించిరి.

"ఆంధ్ర ఆర్థికమంత్రి" శ్రీ తెన్నేటి విశ్వనాథం "సభ జయప్రదముగా జరుగునట్లు, సమితి సభ్యులను కొనియాడుచు పంపిన సందేశమును కార్యదర్శి రాధాస్వామి చదివి వినిపించిన పిమ్మట సభ ముగిసింది.

## "ఆంధ్రరాష్ట్ర ఔన్నత్యానికి కృషి చేయాలి"

మదరాసు, అక్టోబరు 2: మద్రాసు నగరమునందున్న ఆంధ్ర పారిశ్రామిక వాణిజ్యశాఖ అధికారి ఆఫీసునందు, ఆంధ్రరాష్ట్రావతరణ ప్రథమ వార్షికోత్సవాన్ని నిన్న ఉద్యోగులు జరిపారు. పిల్లలకు పెద్దలకు ఆటల పందెములు పెట్టారు. శ్రీ పి. పి. ఐ. వైద్యనాథన్ గారు ఐ. సి. యస్ అందరను ఆంధ్రరాష్ట్ర ఉన్నతికోరకు పాటుపడవలెనని హెచ్చరించిరి. శ్రీమతి వైద్యనాథన్ సతీమణిగారు పోటీలలో పాల్గొన్నవారికి బహుమతుల నిచ్చిరి. కుమారి రాజాముణిచే నాట్యప్రదర్శనము గావింపబడినది.

### శ్రీకాకుళం

శ్రీకూర్మం, అక్టోబరు 1: శ్రీ కోదండస్వామి వారి ఆలయంలో నేమ రాష్ట్రావతరణోత్సవ సందర్భంలో పూజలు చేయించబడినాయి. క్షీరాభిషేకం, హోమాదులు, సుందరకాండ పారాయణం, సహస్రనామార్చన, రాజభోగం అన్నదాన సంతర్పణ జరిపించబడినాయి. శ్రీ పంజెల ఈశ్వరసత్యనారాయణశర్మ గారు ఉపన్యసించారు. శ్రీ పప్పుసూర్యనారాయణగారు సులోచన చరిత్రం పురాణకాలక్షేపం చేశారు. శ్రీ డి. వి. సీతారామస్వామిగారు అర్థిజనులకు భిక్షులకు అనరిణాది ఏర్పాటు చేశారు.

## సభలు - సమావేశాలు

చిత్తూరులోని జీవకారుణ్య అన్నదాన సమాజ భవనమందు యీ నెల 9వ తేదీ మొదలు 19 వ తేదీవరకు శ్రీ శ్రీ శంకరానంద స్వాములవారు శ్రీ శ్రీ రామకృష్ణానంద స్వాములువారు భగవద్గీత, ఉపనిషత్తులను గురించి ఉపన్యాసములు చేస్తారు. జిల్లా కలెక్టరు శ్రీ ఎన్. యాంగటేగారి అధ్యక్షత నరిస్ట్రిక్టు ఇన్‌కంటాక్సు ఆఫీసరు శ్రీ ఎస్. ఎన్. దవేగారు, యీఉపన్యాస కార్యక్రమమును ప్రారంభోత్సవం చేస్తారు.

గుంటూరు జిల్లా ప్రజాసోషలిస్టు పార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశము గుంటూరులో జిల్లాపార్టీ కార్యాలయమందు అక్టోబరు 10 వ తేదీ మధ్యాహ్నం 2 గం॥ లకు జరుగుతుందని సభ్యులెల్లరు హాజరుకావలెనని జిల్లా పార్టీ సంయుక్త కార్యదర్శి శ్రీ టి. ఎస్. రామమూర్తిగారు తెలుపుతున్నారు.

పిఠాపురంకోట కుమ్మరిపద్ద యీ నెల 6 వ తేదీవరకూ టైలర్స్ యూనియన్ వారి ఆధ్వర్యానపూజ్య బాపూజీ జయంతోత్సవములు జరుపబడును, సూత్రయజ్ఞం, ఉపన్యాసాలు సంగీత కచ్చేరీలు వగైరా కార్యక్రమం ఏర్పాటు చేయబడింది.

